# రాతిస్తంభము.

(కల్పితనాటకము.)

పానుగంటి లక్ష్మీనరసింహారావుచే

రచియింపఁబడినది.



మొదటికూర్పు 1000 ప్రతులు.

పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయ

ముద్రింపఁబడియె.

1930.

# పీఠిక.

—:♦:—

ఇది నాయిరువదియైదవ నాటకము. దీనిలోని కథ కల్పితము. నన్నుఁ బోషించు శ్రీ శ్రీ పీఠికాపురాస్థానమహారాజావారి ధనసాహాయ్యమున దీని నచ్చువేయించితిని. శ్రీ శ్రీ మహారాజావారికి వారి కుటుంబమునకుఁ బరమేశ్వరుఁడు సకలశ్రేయముల నిచ్చి సర్వదా రక్షించుఁగాక.

ఈనాటకమునకు నాందీప్రస్తావనలను వ్రాసియిచ్చిన బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారి కనేక నమస్కారములు.

పీఠికాపురము. పా॥ ల॥ నరసింహారావు.

## ఇందువచ్చు పాత్రములు.



### పురుషులు.

నారాయణరావు—కథానాయకుఁడు.

ఇద్దఱు రక్షకభటులు.

వైద్యుఁడు.

కృష్ణుఁడు—నారాయణరావుకొడుకు మూఁడేండ్లవాఁడు.

నరసయ్య—నారాయణరావునకు బాహుగున నున్న బ్రాహ్మణుఁడు.

Etc.

### స్త్రీలు.

లక్ష్మమ్మ—నారాయణరావుభార్య.

వెంకమ్మ—నారాయణరావుతల్లి.

చంద్రరేఖ—నారాయణరావు వేశ్య.

నాగి—వేశ్యమాత.

…చ్చి—లక్ష్మమ్మయింటిలో దాసి.

…మి—వేశ్యయింటిలో దాసి.

Etc.

శ్రీరామా !

# రాతిస్తంభము.

## నాందీ.

క. యావన్మానవదుష్ప్రా
పావళిఁ దృఢిఁ ద్రుంప వారి ♦ ననుతప్తులుగాఁ
గావించి ప్రోచు నల ల
క్ష్మీపతి యొసంగుఁగాక ♦ మీకు శుభంబుల్ !

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—నటీ !

నటి—(ప్రవేశించి) ఏమి సెలవు ?

సూత్రి—శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుకవిగారి యిరువదియైదవ నాటక మగు "రాతిస్తంభము" ప్రదర్శనోన్ముఖముగా నున్నదా ?

నటి—ఆ ! ఆప్రియత్నములోనే యుండఁగా మీపిలుపు వినఁబడి వచ్చినాను.

సూత్రి—పతి పిలువఁగనే వచ్చుట యీలువు గల యిల్లాలి ముఖ్య లక్షణము గాదా ! బహుకారణములచే నిది ప్రశస్యమైన నాటకము.

నటి—కపటగణికాసంభాషణములును, మద్యమత్త ప్రలాపగీతములును వేశ్యామాతృకృత సమ్మార్జనీప్రహారములును, జక్కఁగా వర్ణింపఁబడి యుండుటచేతనా ?

సూత్ర—అవియుఁ గారణములే, కాని గౌణకారణములు.

గీ. చిత్తశోభను హెచ్చించు • చిత్రఫలక
పృష్ఠనీలప్రదేశంబు•రీతి, నవ్వి
గ్రంథసత్పాత్రసద్గుణ•రామణీయ
కంబుఁ జేయు మఱింత హృ•ద్యంబుగాను.

నిమ్మపంటిచాయ గల మేనిమిసమిసలు హెచ్చగుట పచ్చచీర గట్టినప్పుడా? నల్లచీర గట్టినప్పుడా?

నటి—అది కాంతాసౌందర్యగ్రహణపాండితీసంపన్ను లగు తమకుఁ దెలియును గాని వెఱ్ఱిబాగులదాన నగు నా కెట్లు తెలియఁ గలదు? ఇది పరమపతివ్రతాశిరోమణి నాయికగాఁ గలనాటకము కనుక లఘుప్రసంగములు రానీక, యుక్తప్రశంసావాక్యములతోఁ బ్రస్తావన నడపుట మంచి దని మనవిచేసికొనుచున్నాను.

సూత్ర—అట్లైన వినుము.

శ్రీరామనామంబుఁ • జిత్తంబునను జిహ్వ
నెలకొల్పి కీర్తించి • యలరె నెవతె,
పతిని బ్రత్యక్షదై•వతముగా భావించి
తద్దుష్టశీలంబుఁ • దలఁప దెవతె,
జగతిలోఁ గోడండ్ర•సరణిని బోవక
సేవించి యన్నరం•జించె నెవతె,

సంసారపంకసం♦సక్త గాకుండఁ, గు
మ్మరపుర్వుకైవడి ♦ మనియె నెవతె,
యాసతీమణి, లక్ష్మీస♦మాఖ్య, సర్వ
సుగుణముల కాటపట్టైన ♦ సుందరాంగి,
విష్ణుభక్తాగ్రగణ్య, సా♦ధ్వీమతల్లి
ప్రణుతిపాత్రి మీనాటక♦పాత్రములను.

నటి—సత్యమే. పతి కత్తితోఁ బ్రాణములఁ దీయుపోటు పొడిచినప్పుడుగూడ నాహా! ఆయిల్లాలు నమస్కరించి పోయినది గాని యొకతిట్టైనఁ దిట్టలే, దొకమూలుగైన మూల్గలేదు.

సూత్ర— గీ. పసుగుణము పోదు ప్రతిపక్ష♦వర్తనమున
నాత్మతేజంబుచేతనే ♦ యణఁగుఁగాని;
నిప్పు పోవదు మఱియొక♦నిప్పువలన
నంబువులచేత నడ్డి చ♦ల్లారుఁగాని.
చెఱుగు వేఱొకచెఱుగుచే ♦ నుడుప నెంతు
వేసి, యింకొకదుష్కృతిఁ ♦ బృథ్విఁ జొన్పు;
దండుచే శాంతినే యది ♦ యడఁచివైవు
మంచు బుద్ధుఁడు ప్రజకు బో♦ధించినాఁడు.
తన్నుఁ గొఱుతను వేయు పా♦తకులఁ జూచి
"యెఱుక లేనట్టి వీరి క్ష♦మింపు తండ్రి"
యంచు జీజస్సు దేవుఁ బ్రా♦ర్థించెఁ గాని
పనరలే దింతయును లోనఁ ♦ గినియలేదు.

ఇది చెఱకునకుఁ దీపివలె, మంచునకు శైత్యమువలె, మల్లెపూవునకుఁ బరిమళమువలె, నంబకపత్యప్రేమవలె, శుద్ధసత్త్వగుణ

సంపన్నులై యుండు నెల్లకాలములందలిమహాత్ములకును, మహాత్మురాండ్రకును సహజప్రకృతి.

నటి—అంత శాంతమూర్తియై పాప మామె యీప్రపంచమున నేమి సుఖ మనుభవించినది?

సూత్ర—పామరదృష్టి నేమియు లేదుకాని, సుఖదుఃఖతత్త్వరహస్య మెఱింగిన మహాయోగులకుమాత్ర మలౌకికమైన యామె యాత్మానందము గోచరింపఁగలదు.

గీ. రోఁత గలిగించు నెరువు భూరుహములందు
మధురరసఫలవితతిగా మాఱునట్లు
పరహితైషణ శ్రీరామభక్తులందు
బాధ లెల్ల సుఖములుగాఁ బరిణమించు.

నటి—ఆలాగునా? అదిగో ఘంటానాదము వినఁబడుచున్నది. లక్ష్మీపాత్రము ప్రవేశించుచున్నదికాఁబోలు. ఇఁక మనము పోవుదము రండు!

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

కూచి నరసింహము.

శ్రీరామా!

# రాతిస్తంభము.

## ప్రథమాంకము.

ప్రదేశము—రాజానగరము.

ప్రవేశము—లక్ష్మి.

లక్ష్మి—సంసారము బాగుపడు నను నాశ లేదు. ఏమి చేయవచ్చును? ఇదివఱకెన్నిసారులో బతిమాలుకొంటిని. భగవంతుఁడా! తండ్రీ! నీయిష్టమెట్లో యట్లే జరుగుఁగాక! ఏపూర్వజన్మకర్మఫలమో యనుభవించుచున్నాను. కిక్కురుమనకుండ ననుభవింపవలసినదే. ఇఁక నాభర్త వేశ్యయింటినుండి వచ్చువేళ యైనది. పాదప్రక్షాళనమున కుదకము సిద్ధపఱుపవలయును.

(నిష్క్రమించును.)

(నారాయణరావు ప్రవేశించును.)

నా—వేశ్యారక్తి కలిగిన రసజ్ఞునకు సంసారపుజంజాట ముండఁగూడదు. ఈదిక్కుమాలిన సంసారపుగొడవ యైహికానందానుభవమునకు నిరోధకమే—యాముష్మికానందానుభవమునకు నిరోధకమే— అందుకొఱకే సంసారమును బరిత్యజింపవలయునని పెద్దలు చెప్పినారు. కట్లు—దిక్కుమాలినకట్లు—తెగ

## రాతి స్తంభము.

రానికట్లు—ఈసంసారమున నెన్నియైన నున్నవి. ఒకమూల భార్య. ఒకమూల తల్లి. ఈమె ధుమధుమ. ఆమె రొసరొస. ఒకక ట్లున్నప్పుడే మనోవైశాల్యమున కవకాశము లేనప్పు డీ రెండుక ట్లున్నఁ జెప్పవలయునా ? కాళ్ళకొకకట్టు, చేతుల కొకకట్టుచాలక దిక్కుమాలినభగవంతుఁడు కొడుకు నొక్కని నిచ్చి గొంతుకకుఁగూడ నొకకట్టు కట్టినాఁడు. ఇక్కడికిఁ బ్రపంచదుఃఖమునకుఁ బరమావధి యన్నమాట. అక్కడకుఁ గదలిక గలవాఁడను గావున లక్ష్యపెట్టక కొట్టుకొనివచ్చుచున్నాను. ఈసంసారములోనున్న పెద్దచిక్కు—నేను గనిపట్టినదేదనఁగా—సంసారమును మనము లక్ష్యముచేసినకొలఁదియు, నాదరించి యడఁగియున్నకొలఁదియు నది మీఁది కెక్కి కాలి క్రింద మనలను ద్రొక్కును. ఎంతసేపు వినినది విననట్లుండవలయును— చూచినది చూడనట్లుండవలయును. ఏదియు దరికి రాకుండ దులిపివైచుకొనవలయును. "నళినీదళగత జల" మని చెప్పినవాని యభిప్రాయ మిదియే యని తోఁచుచున్నది. ఎంత దులిపివైచికొని—యెంతదూరముగా నుండఁ బ్రియత్నించినను సాగదు. పనికిమాలినప్రపంచధోరణి యట్లున్నది. ఉదయము, సాయంకాలము నింటికి రాకతప్పదు. రాకపోయిన మొదలఁ దల్లియు గోలయే— పెండ్లాము గోలయే— ఈగోలఁ జూచి యిరుగుపొరుగయ్యకొయ్యలు నమ్మలక్కలు నూరెగిరి పోయినంత యల్లరి— ఏమి ? వారిసొమ్ము నాకేమైనఁ బెట్టుచున్నారా ? నాసొమ్ము నేను దగులఁబెట్టుకొన్నమొదల వారి యేడు పెందులకు ? నాభార్యయొద్ద నేను బందుకొనకున్న మొదల నూరిపేరటాండ్రగోల యెందులకు ? నాభార్య—పాప

ము— అది యంతగా నేమియు ననసే యనను. దానికి లేని దేవులాట వీరి కెందులకో— దిక్కుమాలిన ప్రపంచము— సిగ్గుమాలిన ప్రజలు. నో రెత్తినయెడల మూఁతిమీఁదఁ దన్న వలసినది.

(లక్ష్మి ప్రవేశించును.)

లక్ష్మి—నాథా! నమస్కారము. వచ్చితిరా! పాదప్రక్షాళనమునకు నీ రిదిగో తెచ్చినాను. కాళులు గడిగెదను.

నారా—ఇప్పుడు నీకొఱకు జోడు విప్పనా? కాళులు వలదు— చేతులు వలదు. శుద్ధచ్ఛాందసురాలవు. ఇంటికి వచ్చుసరికిఁ జేఁపురుకట్టతోను, చేడనీళ్లతోను సిద్ధమగుదువు. నాకుఁ గాళ్లకు నీళ్ళక్కఱ లేదు.

లక్ష్మి—కాళ్లైనఁ గడుగుకొనకుండ భోజనముచేసెదరా?

నారా—నాకు భోజన మక్కఱలేదు.

లక్ష్మి—ఎందుచేత?

నారా—గడియక్రిందటఁ గడుపునిండ గారెలు దిన్నవాని కిప్పుడు భోజన మేల?

లక్ష్మి—ఎక్కడఁ దిన్నారు?

నారా—ఈనడుమ కావేరిసానికిఁ గాకినాడకోమటి కన్నతీకము చేసినాడుకాదా? అందుకొఱకుఁ గావేరి మా కందఱకు విందు చేసినది.

లక్ష్మి—అట్లైన దానియింటిలోనే భుజియించినారా?

నారా—అదిగో-తిరుగఁ దగవుఁదెచ్చిపెట్టినావా? అది యంటని-యిది మైల యని, మనము బ్రాహ్మణుల మని, వారు వేశ్య లని మారంభించినావా?

లక్ష్మి—మనము శ్రోత్రియకుటుంబములోనివారము కామా? వారు వండినది మీరు తినుట తప్పుకాదా?

నారా—[illegible] వండలేదు. స్వతపుబ్రాహ్మణుడు వండి తెచ్చినాడు. ఇంటిలోఁ గూర్చున్న నీ కీర్తనభజన లెందులకే? ఈమడిమైల రాద్ధాంతము లెందులకే? మగవారు—వీథిలోనికిఁ బోవలసినవారు—పదిమందిలోఁ దలయెత్తుకొని తిరుగవలసినవారు—అవసరానుసారముగా వారివారి సాంఘికవ్యాపారములను జక్కఁబెట్టుకొనువారు—అట్టివారు వారియిష్టానుసార మేదో చేయుదురని తటస్థముగా నూరకుండవలయును గాని యాఁడుదానికి మగవారివీథిగొడవ లెందుకు? విందులగొడ లెందుకు? వారాంగనలయింటిలో మనము తినఁగూడదా? ఎక్కడినీతి యిది? ఏపురాణములో నున్నది? ఏధర్మశాస్త్రములో నున్నది? ఉండనీ—ఉండకపోనీ! గ్రంథాలగొడవ మన కక్కఱలేదు. ఆచారమెట్లున్నది? ఈశ్రోత్రియకుటుంబములవారిలో వేశ్యాంగనలయింటిలో విస్తరి వేయనివా రెవరు? వేశ్య లనఁగా నీకంటికి నలుకుగుడ్డ పెంటచేటవలెఁ గనఁబడుచున్నారు కాఁబోలు! వీరి పూర్వోత్తరములు నేను జెప్పెదను విను—సముద్రమథనకాలమందుఁ బుట్టిన యప్సరస్స్త్రీలలోఁ గొందఱు పైలోకమునకుఁ బోయినారు—కొందఱు భూలోకకల్యాణముకొఱ కిక్కడనే యున్నారు—వారు లక్ష్మితో సమానమైన దేవత లన్నమాట! తెలిసినదా? వారిలో బ్రాహ్మణాదివర్ణవిభాగము లేదు—వారిచేతిప్రసాద మమృత మన్నమాట. వారు మహీమండలమంగళదేవతలు. వారిని నిందించినవారికిఁ గన్నులు చిల్లులువడును.

లక్ష్మి—నాథా! వారిని నే నేమియు ననలేను.

నారా—నన్నుమాత్ర మనుట యెందులకు? ఏమధ్యాహ్నమో, యే సాయంకాలమో యింకఁ దప్పదుకదా యని దినమున కొక మాఱు నే నింటికి మెతుకులకొఱకు వచ్చినప్పుడు, నీవో, మాయమ్మయో యేదో సూదుమాట లాడుట యెందులకు?

(వెంకమ్మ ప్రవేశించును.)

వెంక—ఏమిరా! అది నిన్నెప్పుడైన సూటిమాట లాడెనా? ఇల్లాలు— మహాసాధ్వి— తిట్టిన సహించినది— తన్నిన సహించినది. కొట్టిన సహించినది. నీముండకొఱకు తనయొడలిమీఁదినగ లిచ్చినది. ఒక్కనానుపోఁచతో నున్నది. లోకోత్తరగుణసంపన్నయైన యీబంగారుబొమ్మను సూదుమాట లాడుచున్నావని మందలించుచున్నావా? ఇఁక నేను నిన్నుఁ దిట్టఁదగనా? కన్నదానను నీకు బుద్ధిచెప్పఁ దగనా? మాన్యముఁ దగులఁబెట్టి దానియెవానఁ బెట్టితివే? 'నీకొడుకు భాగమును వేరుచేసి నీభాగ మమ్ముకొనరా' యని నేను నీకాళ్ళపైఁ బడి చెప్పితినే— ఊరివారిచేతఁ జెప్పించితినే. నీ పిన్నవిధవుల సంసారమును భ్రష్టపఱచినందులకు నిన్నేమి చేసిననైనఁ బాపమున్నదా?

నారా—అమ్మా! నీ కిష్టమైనయెడల నింటికి వచ్చెదను. లేదా— ఇదికూడ మానుకొందును.

వెంక—వచ్చి నీవుచేయుచున్న ప్రయోజకత్వ మేమి? నిక్షేపమువంటి యిల్లాలితోఁ గష్టము సుఖము—మాట మంతి— యేమైనరునవా? కానరానికొడుకు—నీతండ్రిపేరు పెట్టుకొంటిమి. ఆకుఱ్ఱవానిని నొక్కసారి బుజమున నెత్తికొంటివా? నీవు వాని నెత్తికొనఁగఁ జూడవలయు నని నాకు ముచ్చట కాదా? అడిద

మా—బెడిద మని యట్లెవచ్చుట—పట్టుబట్ట చుట్టఁబెట్టుకొనుట—ముంగాళ్లపైఁ గూర్చుండి మూఁడుమెదుకులు ముక్కునకంటించుకొనుట—హల్లుహల్లు మనుచుఁ బిలుపునకైన నందగుండ ముండయింటికిఁ బోవుట—ఈమాత్రమున కింటికి రాకపోయిన నేమి? ఛీ!

లక్ష్మి—(అప) అత్తా! అంతకఠినములైనమాట లెందులకు? ఆయన దయయుండి వచ్చినప్పుడే నాకుఁ బంగారు. రావలదని యనుట యెందులకు?

వెంక—(అప) నీమెత్తఁదనముచేతనే వాఁడు పాడైనాఁడు. నీయోగ్యతను గాపాడుకొనుటకే నీవు చూచుచున్నావు కాని వానిని విరోధించి బాగుచేయవలయు నని నీవు చూచుచుండుట లేదు. కొంతకటువుఁదనము వహించి యెదురుతిరిగి నిర్భయముగ నాతనిని విరోధించినఁ గాని యతఁడు బాగుపడఁడు. అట్లు భర్త నెదిరించుట నీకుఁ బరమార్థలోప మని సంశయించుచున్నావు. అది తప్పు. భార్య గురుస్వరూపయై పనికిమాలినభర్తను శిక్షింపవలయును. అట్లు చేసినఁగాని నీకు మోక్షము లేదు. వానికి మోక్షము లేదు.

నారా—అమ్మా! ఒక్కప్రాణమును. మీరు ముగ్గురు. మీకు నన్నుఁగూర్చి యింతకంటక మెందుకు? నాకు శరీరములో రోగము ప్రవేశించినది. అమ్మా! నీకంటె నేనే ముందేమో? నన్నెందు కల్లరిపెట్టుదురు. నామూలమునఁ జంద్రరేఖ కల్లరి యెందులకు? ఇక్కడనుండి కదలనులే. ఇక్కడనే స్థావరమునై, యిక్కడనే పాతుకొని యుందునులే— మీకన్నులు చల్లఁగా నాకు భూశయన మిక్కడనే చేయుదురుగాని లే—

వెంక—నీ మొగము—నీ మోర. స్థావరము లేదు—జైనవిగ్రహము లేదు. దర్భశయ్య లేదు—పూలరథమువంటి భార్యయొద్ద సుఖముగాం బండుకో! పిల్లవానిని మీ రిద్దఱుంగూడ నడ్డముగా గుండెల మీఁదఁ బెట్టుకొని పండుకొనుఁడు. స్వచ్ఛమైన యిల్లాలితో నున్న సుఖము, కడుపారఁ గన్నబిడ్డను మెడమీఁదఁ బెట్టుకొని యొకుగులాడిన సుఖము నెఱిఁగిన ముండకొడు కెవ్వఁడైన, బ్రష్టగుడిస్త్రీతెటుముండపడుకగదివాయిఖానాపెరటిలోనికిఁ బోవునా? బుద్ధిహీనుఁడవై పోయితివి—పూవులతోఁ బూజింపఁ దగిన యిల్లాలిమెడల మహాపచార మొనర్చితివి. లెంపలు [illegible]కో—లే—అన్నయునవదు రా—

నారా—నేను రాను.

వెంక—ఎందుచేత?

లక్ష్మి—అత్తా! గోదావరిసాని యఁట. కోమటయ్య కన్యాతికముఁ జేసినందుకు విందు చేసినదఁట.

నారా—గోదావరి కాదు—నీ మొగము—కావేరి. అయినను నీ కాగోడన యెందుకే?

వెంక—యజ్ఞశాలలో వేదఘోషము నిన్ను సోమపానముఁ జేసిన మీతండ్రికడుపున నీవు పుట్టి కన్యాతికపుగదిలో ఫలాహారములు చేసితివా? (అప) లక్ష్మి! నేను బోవుదును. నీవు ఈవంత బోధింపుము. అవసర మగునెడలఁ గన్యాత్తిచేయుము.

(పోవును.)

లక్ష్మి—నాథా మీయమ్మగా రన్నమాటలకు మీ రిబ్బందిపడవలదు. ఆమె పెద్దది. ఆమె మనకు బుద్ధులు చెప్పఁదగినది. లోకమం తయుఁ బ్రతిష్ఠ వ్యాపింపఁజేసిన మీతండ్రిగారు [illegible]

లైనాసుకదా! వారివంశమర్యాద మీరు కాపాడకపోయిన యెడల నెవ్వరు కాపాడుదురు? అయ్యో! వంశకీర్తి పోవుచున్నదే యని యాందోళనముచేత నామె దేవులాడుచున్నది. తల్లిమాట వినుటకంటె గొడుకు చేయఁదగిన దేమున్నది?

నారా—ఎంతసేపు సొమ్ముపోయినది-సొమ్ముపోయిన దని యొక్కటే గోల-తల్లిముండలకు చావుసమీపించుచున్నకొలఁది ధనవాంఛ హెచ్చగును. ఈపనికిమాలిన సొమ్మెవ్వనికి శాశ్వతమో చెప్పు. తెక్కలువచ్చి దానియంతె నది యెగిరిపోవుచుండఁగా నే నేమి చేయవలసినది?

లక్ష్మి—పోయినసొమ్మునకు మనము విచారింపవలదు. మీమీఁద నది దిగదుడుపని యనుకొందము. ఇంతటినుండియైన మీరింటి యొద్దనే యుండి, భవతారకసాధన మైన మాతృసేవఁ జేయుచు, నల్లారుముద్దైన పిల్లవానిని బెంచుకొనుచు, నతిథిసేవఁ జేసికొనుచు గృహకృత్యములు నిర్వహించుకొనుచు నుండవలయు నని ప్రార్థించుచున్నాను.

నారా—నాకుఁగూడ నింటియొద్దనే పండుకొనవలయు నని యుండును. అదేమికర్మమో—రవంతసేపైన బుద్ధి నిలువఁబడదు. ఏమి చేయుదును?

లక్ష్మి—అప్పు డేమి చేయుదురనఁగా—నిలువఁబడి, రెండుచేతులు జోడించుకొని "శ్రీరామచంద్రమూర్తీ! నీవు పితృవాక్యపరిపాలకుఁడవు-ఆశక్తిలో సహస్రాంశము నాకుఁ బ్రసాదింపుము. నీ వేకపత్నీవ్రతుఁడవు. ఆశక్తిలో లక్షాంశమైన నాకుఁ బ్రసాదింపుము-రామా! నీలమేఘశ్యామా! నీవు నిశ్చలహృద

యుండవు. అరిషడ్వర్గసంహర్తవు—ఆశక్తిలోఁ గోట్యంశమైన నాకుఁ బ్రసాదింపుము. ఇట్లొనర్పుటయేగాక—నాతండ్రీ! నీపాదారవిందములయందు సంతతమైన భక్తి నాకుఁ గటాక్షింపుము. ఓంశాంతిశ్శాంతి" యని భగవంతుని ధ్యానింపుము. ఏమి-నేను జెప్పినట్లు చేయుదురా?

నారా—(పలుకకుండ గుఱ్ఱుతీయును.)

లక్ష్మి—అయ్యో! అప్పుడే నిద్రించినాఁడే. (లేచి చేతులుజోడించుకొని పాడును)

కీర్తన.

జయజయ రాఘవ జానకిరామ్-రఘుకులరామవ రాజారామ్
రావణమారక రాఘవరామ్-రఘుకులదీపక రాజారామ్
నీరధిబంధన రాఘవరామ్-మారుతిసేవిత రాజారామ్
దశరథనందన రాఘవరామ్-దానవభంజన రాజారామ్
మునిసవనావన రాఘవరామ్-పురహరపూజిత రాజారామ్
మంగళగుణగణ రాఘవరామ్-మంజులభాషణ రాజారామ్
పతితపావన రాఘవరామ్-భక్తినొసఁగుమా రాజారామ్
జానకిరంజన రాఘవరామ్-జన్మవిభంజన రాజారామ్.(జయజయ॥)

నాథా! నాథా! వేశ్యయింటికిఁ బోకుండ నిచ్చటనే పండుకొంటివిగదా! నాయింటి కిప్పుడు కళవచ్చినట్లున్నది. నాకంటి కిప్పుడు దృష్టివచ్చినట్లున్నది. సుఖముగాఁ బండుకొనుము. నిన్ను లేపను. నాథా! మనపిల్లవాఁడు పుట్టి మూఁడుసంవత్సరములైనదిగదా! అప్పటినుండియు నీవు నన్ను స్పృశింపలేదే. తిన్నగఁ గంటనైనఁ జూడలేదే. నీ పిమ్మటఁడు సంవత్సరము లొడలు తెలియని మహానందమునఁ గులుకులతోఁ గులికిపోయితివే.

## రాతి స్తంభము.

నీవు వేశ్యాలింగనసుఖ మనుభవించుచుండఁ బ్రమాదమున నైన నొక్క క్షణకాల మైన నన్నుఁ దలఁచితివా? నాపాలిటి నారాయణమూర్తి వగు నీనామమును స్మరించుకొనుచు నేఁ గాలక్షేపము చేయుచుంటినిగదా! పోనీ! నీవు సుఖపడినయెడల నాకుఁ జాలును. నీతో నేను జీవించియున్నప్పుడు నీసుఖమే నాసుఖము కాదా? నన్ను మందలింపు మని, బెదరింపు మని, కోపింపు మని, నాశింపు మని పరాయత్తగాను నాతోఁ జెప్పినావు. ని న్నొక్క మాటయైన నే ననఁజాలను. నేను వయస్సులోనున్న పెండ్లాము గాదా! అదిగో! నోరెఱుఁగని పసిపాపఁడు కాఁడా! నాథా! నీవు నన్నుద్ధరింపవలయు నని వేర చేసి చెప్పవలయునా? నేను చెప్పుటకు నీవు తెలియనివాఁడవా? నాయదృష్టము బాగుగనున్నచో భగవంతుఁడు నీకే తోచింపఁడా? పోనీ. దైవేచ్ఛయే జరుగుఁగాక! ఐహికకష్ట మెంత కాల ముండును? నేఁడో రేపో వెడలిపోవునప్పుడీమాత్రమునకై యిహలోకమైన మఱి భర్తను దూలనాడుదునా? పుణ్యము లేనసరికదా- ఈపాపముమూట నాతోఁగూడ నెందులకు? నాథా! మూఁడేండ్లనుండి నీపాదము లొత్తుభాగ్యము నాకుఁ గలుగలేదు. (భర్తపాదములను కన్నుల కద్దుకొని) ఇప్పుడీవిధముగా ఋణవిముక్త నగుచున్నాను. ముప్పదియారుమాసములనుండి నేను నీస్పర్శసుఖ మెఱుఁగను. (ముద్దుగొని) ఇదిగో ఇదియే చాలు. ఇఁక నాలుగేండ్లు నిన్ను దాఁకకున్నను నాకు బెంగలేదు. నే నిఁకఁ బండుకొందును. (పిల్లవానిని దొట్టినుండి తీసి తనప్రక్కలోఁ బండఁబెట్టుకొనును.) నాతండ్రీ! నీనాయనగారు మనపుణ్యమున నీరాత్రి యిచ్చటనే పండుకొన్నారు.

నాయనా! నీవు పుట్టినతరువాత నాకు సుఖమైన దినమియే. నేను బండుకొందును. రామా. రామా. (పండుకొనును.)

నారా—(నిమ్మళముగ లేచి) నేను నిద్రపోవుచున్నా నని యెదో పనికిమాలిన దైవప్రార్థన చేసినది. దానితో నా కసహ్యము వైచినది. తరువాత నేదియో నోటిలో గొణగుకొన్నది. కాళులు కన్నుల కద్దుకొన్నది. ముద్దొక్కటి పెట్టుకొన్నది. ఈ ముద్దు నాపుట్టిముంచినది. నాభార్యయొద్దఁ బండుకొనకపోవుటయే కాక యొకరి నొకరు ముద్దిడుకొన మని నేను జంద్రరేఖయొద్దఁ బ్రమాణము చేసితిని. దీనిముండమోయ- దీని మూలమున నిప్పుడు నావ్రతమునకు భంగము కలిగినది. నేను ముద్దుఁబెట్టుకొన్నయెడల నాది దోసము కాని యది యిట్లు చేసినయెడల నాదోష మేమున్న దని కొంత సమర్థించుకొన వచ్చును. సమర్థనవలనను వచ్చినదా నాకర్మము? నాయన్న నన్నుఁ దిట్టినందువలన నే నిక్కడఁ బండుకొంటి నని వీరియభిప్రాయమై యుండును. నేను బుద్ధిపూర్వకముగా నే పండుకొంటిని. సారాయంగడివానికిఁ జంద్రరేఖ నలుబదిరూపాయలవఱకీయవలసియున్నది. వాఁడు దానిని గారాగృహమునం దుంతు నని బెదరించుచున్నాఁడు. దానిమర్యాదఁ గాపాడుటకు నేను గాక మఱెవ్వరున్నారు? నూర్లకొలఁది నిచ్చెద నని గిరగి యింటిచుట్టు తిరిగిన సరసులను సాగనంపి నన్ను నమ్ముకొన్న దానిపరువు నేనే కాపాడవలసియున్నదికాదా. నాయిల్లాలి డలో నింక మిగిలియున్న నాను దీసికొనిపోవ నిక్కడఁ బండుకొంటిని. అడిగినయెడలఁ దప్పకుండ నిచ్చును. ఇదివఱకెన్నో గుల్లలిచ్చిన కారణమున నడుగుటకే మన స్సొప్పకపో

నది. అందులోను నాకు మోమోటమి యింతయంత కాదు. అందుచేత దొంగతనమే శరణ్యమైనది. నాసొమ్ము నేను దీసికొనుటలోఁ దప్పు లేదు కాని— అయినను బుద్ధిమాలినప్రజలు కాదా? ఎంతసేపు తప్పెన్నుటయందే వారికి ముచ్చట. (భార్య మెడలో నాను దీసికొనును.) ఇది యట్టె బరువుగాఁ గనఁబడదు. ఇది చాలకపోయినప్పుడు తిరుగ నద్దెయద్దె యని సొమ్మునకెక్కడకుఁ బరుగెత్తవలసినది? పిల్లవాని చేతి యొత్తులుగూడఁ దీసికొందును. (తీసికొనును.) అదిగో! ఒత్తులు పెట్టినస్థలమునఁ జేయి రవంతసన్నగిల్లి యున్నదే. పాపము. ఇవి తీసివైచితిని గాని చేతులు పాడైపోవలసినది. చంద్రరేఖ వీథిగుమ్మములో నాకొఱకుఁ గనిపెట్టుకొని యుండును. త్వరగఁ బోవలయును. వీథితలుపు తీసికొని పోవుదును. ఎవరో దొంగలు వచ్చి యీ వస్తువులు హరించుకొనిపోయినా రని ప్రతీతి కల్గును. ఏదో జరుగును. ముందేమి జరుగునో యనుచింత యెందులకు?

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.



శ్రీరామా!

# రాతిస్తంభము.

## ద్వితీయాంకము.

పరిదేశము—చంద్రరేఖయిల్లు.

ప్రవేశము—నారాయణరావు, చంద్రరేఖ, (సారాబుడ్డి చేతులతో).

చంద్ర—చచ్చిచెడి, చచ్చిచెడి యొక్క—నాను దీసికొనివచ్చితివా? చచ్చునాను— పాతికెరూపాయలైన రాదయ్యేను.

నారా—పిల్లవానియొత్తులుకూడ నున్నవి కాదా?

చంద్ర—ఏవీ! ఇంక నాచేతిలోఁ బెట్టవేమి? అవి నీవమ్ముకొని త్రాగవలయు నని యనుకొంటివా యేమి?

నారా—ఇవిగో. (ఇచ్చును).

చంద్ర—(తీసికొని) ఇది యేమి? ఇత్తడివస్తువులే! ఓరి నీగొంతు గోయ— బంగారపువస్తువు లని చెప్పి నన్ను మోసపుచ్చె వంటరా?

నారా—అఁ! అఁ! నన్ను క్షమింపుము. నే నెఱుఁగను. నన్నాముండ మోసపుచ్చినది.

చంద్ర—నీపెండ్లామేనా?

నారా—అవును.

చంద్ర—దానిసిగ గోయ. ఎంతమోసకత్తెయో ?

నారా—ఇంటికిఁ బోయి దానిని చెప్పు తీసికొని తన్నెదను. తెల్లనిది వెండి, పచ్చనిది బంగార మని నాయూహామే కాని యింత మోస మున్న దని నే నెఱుఁగుదునా ?

చంద్ర—నీ వొకటియెఱిఁగి యేడ్చుదువా ? ఏమియు లేదు. వట్టిదద్దమ్మవు. భార్య పతివ్రత యని కొనియాడెదవు. నీభార్య యోగ్యత యిప్పుడు తెలిసినదా ? మూఁడేండ్లనుండి మహాపతివ్రత నీకొఱకుఁ గనుపెట్టుకొని యున్నది. సిగ్గుమాలిన మొగమా ! మూల నున్న యత్తముండ ముసలిదయ్యెను. తొట్టెలో బాలుఁడు మూఁడేడుకంటె నెక్కువ లేఁడయ్యెను. అమ్మగారికి రాత్రి యిల్లంతయు సర్వైభ్యము. అందులో బాపనముండలు! ఇదిగో మీయాఁడువారు పేధనిబడినతరువాతనే కాదా మావృత్తులన్నియు మన్నుగలసిపోయినవి. మూఁడేండ్లనుండి ముసుఁగుఁ బెట్టుకొని ముడుచుకొని మూలఁ గూర్చున్నదా ? ఛీ ! అంతదీక్షతోఁ గనుపెట్టుకొని యుండుటకు తెలివితక్కువ చంద్రరేఖ కాదు.

నారా—దానిరూపము సామాన్యముకాని యున్నవి శేషము యోగ్యతయేకాదా !

చంద్ర—నీవు చచ్చినఁగాని చంద్రరేఖను స్తుతింపవు. అందుకు నోరు రాదు. రాజగారిప్రధానుఁడు నాకు మాన్య మిచ్చెద నని వార్త చేసినాఁడా ? నే నేమంటిని ? అప్పుడు నీవు నాయొద్దనే యుంటివికాదా ? చెప్పు—గుటకలు మ్రింగుచు గ్రుడ్లుపెట్టుకొని చూతువేల ?

నారా—మాన్యము కాదు—అగ్రహార మిచ్చినసరే నారాయణరావున

కధీనమైన యీశరీరమును దుద కర్పింపవలసిన దగ్గిర కే యని వార్త నంపితివి.

చంద్ర—ఆమాటలో నర్థము బుద్ధిహీనుఁడవైన నీకుఁ దెలియకపో యెను గాని లోకమంతయు నట్టడికిన ట్లయిపోవునదే! ఆసం గతి యటుండనీ. తుసికోమటి రాత్రి కైమువంద లిచ్చెద నని వార్త నంపినాఁడుకదా—దినమున కైమువందలచొప్పున సంవత్సరమునకు రెండులక్షలయేబదివేలు రాబడి యైనదా? పెద్దజమీందారీ యన్నమాటయేనా? నే నేమంటిని? చెప్పు మన మిద్దఱమే కాదా?

నారా—కోమటి మొగము నీజన్మమునఁ జూడ నని యంటివి.

చంద్ర—చెప్పితినైన నాయోగ్యత నీవు గ్రహింపఁగలవా? అది యటుండనీ-నీభార్యవస్తువులు దెమ్మని నన్ను నీయింటికిఁ బంపి యుంచునా? పుట్టిమునుఁగవచ్చినది కావునఁ బంపవలసివచ్చి నది. ఏమి చేయను? నాకర్మము. ఆఁడుదియై పుట్టఁగూడదు. అందులో వేశ్యయై పుట్టఁగూడదు. మఱి యందులో నీతిగల వేశ్యయై పుట్టఁగూడదు.

నారా—ఆపుట్టిమునక యేమి! ఏమి!

చంద్ర—సారాపాటదారునకు నలుబది వేలబాకి కాదా? ఆ బాకి నేను గొట్టివేసెదను నామాట యేమన్నావని చెట్టుకిందిన్యాయ వాదిచేత వార్తనంపినాఁడు. అందుచేత నీకుఁ దొందర యి య్యవలసివచ్చినది.

నారా—ఆఁ! ఆఁ! ఎంతపొగరు? లంజెకొడుకు!

చంద్ర—ఆతనితప్పేమున్నది? నేను వేశ్యను గాదా. అందుచే నం దఱకు లోఁకువయే. బట్టలుడికెడు చాకివాఁడు కన్నుగీఁటే.

గుఱ్ఱము గుట్టిన జంగమువాఁడు కన్నుగీఁటె. అద్దెకు బండిగట్టిన దక్షిణ్యాకూడఁ గన్నుగీఁటె. ఏమున్నది? నాబ్రతుకు కిట్లున్నది. పోనీ! స్వభవము కేమైన సరిగా నున్నదేమో యని యనుకొనఁగ—నిత్తడి యొంటులట! సిద్ధమైన పెద్దమ్మవు. నీవు నాకేమి చేయఁగలవు? పోనీ—నీపై మమకారము వదలుకొంద మన్న నాతరము కాదు—నన్నుఁ బుట్టించిన బ్రహ్మదేవునితరము కాద య్యెను. ఎక్కడఁ జావుమంటివి? నీకెట్లుఁ జెడ్డపుట్టిమునుక వచ్చినది!

నా—నీవిశ్వాసము, నీయోగ్యత నే నెఱుఁగక పోలేదు. నీవు నా కొఱ కెంతస్వార్థపరిత్యాగ మొనర్చినది గుర్తింపక పోలేదు. నాచర్మముతో నీకు ముచ్చెలు కుట్టించినను నీఋణము తీర్చు కొనలేను. నాభూమి నీ కిచ్చితిని. నాయిల్లు నీదే యయ్యెను. ఇంతకంటె నే నేమి చేయఁగలను?

చంద్ర—నీభూమి నా కిచ్చితి వని నీవు చెప్పలాడ నక్కఱలేదు. నీకుఁ గావలసినయెడలఁ దిరుగ వ్రాయించి యిచ్చెదను. తీసికో. క్రిం దటిసంవత్సరము పండలేదు. పన్ను దండుగ యిచ్చుకొంటిని. ఈసంవత్సరము పండునో యెండునో తెలియదు. దినము లెట్లు గడచునో యని భయముగా నున్నది. నీ వికఁ బదుకటెంటి కక్కఱకువచ్చువాఁడవే కాని వంటయింటికక్కఱకు వచ్చు వాఁడవు కావు. నా కాసంగతి తెలియును. పోనీ, నీభార్య నైనవారికైన నప్పఁజెప్పి యేదో యుద్యోగము సంపాదించుకొని నన్నుఁ బోషింతు వేమో యని చూడఁగ నిల్లాలమ్మతో యున తెగడిగఁ బోగ బుచ్చుచున్నవయ్యెను.

నారా—నీవు నన్నట్టి మందలింపవలసిన పని లేదు. నేను నిన్నెటు లైనఁ బోషింతును.

చంద్రి—సరే చూతము. నీ వెక్కడికిఁ బోవుదువు? నే నెక్కడికిఁ బోదును? చూడు-నీ వింటికిఁ బోయితివి కదా, నీవు నీ భార్య యొద్దఁ బండుకొంటివా ?

నారా—నా భార్యయొద్దఁ బండుకొనుటా ? హే. హే. హే ! ఇదిగో! ఈమీసముఁ జూచినావా ! అన్నమాటకుఁ దిరుగన్నఁ డైన నుండెనా ?

చంద్రి—పోనీ ! నీ భార్య నిన్నేమైనఁ గదల్చినదా ?

నారా—పాపము—లేదు.

చంద్రి—మగఁడవయ్యెను-మూఁడేండ్లకిందట దానియొద్దఁ బండుకొంటివయ్యెను-నీవు రాత్రి దానిగదిలో నుంటివయ్యెను—తిరిగి యిటకు రావలసినవాఁడవయ్యెను. నిన్నామె యెందులకు స్పృశింపలేదో యిప్పటికైన నెఱుఁగుదువా ?

నారా—నా కిష్టము లేకపోవుటచేత నేను దొంగనిద్రపోయితిని. నన్ను లేపుట కామె కిష్టము లేకపోయెను. అక్కడికిఁ బాపము నన్ను వదలలేక నా దొంగనిద్రలోనే నన్ను బుగ్గమీఁద ముద్దుపెట్టుకొన్నది.

చంద్రి—అయినదా ? ఇఁక నీవ్రతము మండిపోను. ఎందుకావివాహము ? గౌరిగించుకో.

నారా—నాతప్పు లేదు కాదా ?

చంద్ర—ఏదౌడమీఁద ముద్దుపెట్టుకొన్నది ?

నారా—ఇదిగో—ఈకుడిదౌడమీఁద.

చంద్రి—ఆదౌడ గాడిదెమూత్రము పెట్టి కడిగి, పిడక నిప్పుపెట్టి

కాల్చి, యీదాడనైపు పండ్లన్ని యూడదీయించుకొన్నఁ గాని యది పనికిరాదు. మూఁడేండ్లదీక్ష కుక్కముట్టుకొనిపోయి నదా ? ఏమువలేకపోయినావు.

నారా—నే నప్పు డేమవనే యేడ్చినాను. మించిపోయినదాని కేమి చేయవలసినది? నే నింక మాయింటి కెన్నఁడును బోను. ఇది ప్రమాణముగాఁ జెప్పినమాట. ఈప్రమాణము మీఱినయెడల నీవు నన్నెంతపనిచేసినను నే నొప్పుకొందును. ఈసారిమా త్రిము తప్పినయెడల మీసాలే కాదు, బుఱ్ఱకూడ గొఱిగించు కొందును.

(నేపథ్యమున) చెంద్రీ ! మంగలి వచ్చినాఁడు.

నారా—వీనిబుల్లు వల్లకాడుగాను. వీఁ డెవఁడో సమయానికే వచ్చి నాఁడు.

చంద్ర—బుడ్లు తెచ్చినాఁడా ?

(నేప.) ఆఁ.

వేశ్యమాత—(ప్రవేశించి) ఇదిగో. (బల్లమీఁదఁ బెట్టును) (అప) సారాపాటదారుఁ డొక్కపావుగంటలో వచ్చెద నని మంగ లితోఁ జెప్పినాఁడఁట. ఈదరిద్రపుముండకొడుకు నావల కీడ్చి వేయుము.

చంద్రి—(అప) పోనీ. ఏవో మాటలు చెప్పి నీవసారాలోనికిఁ దీసి కొనిపోఁగూడదా ?

వేశ్యమా—(అప) ఊఁహూ.

చంద్రి—(అప) దెంద్రయాయన నీకొఱకు వచ్చినాఁడా యేమి ?

వేశ్యమా—(అప) ఆగొడవ నీ కెందుకు— వీనికి గొంతుకవఱకు సారా పోసినయెడల నేవో వెఱ్ఱికేకలు పెట్టును. ఆవంక పెట్టి

యావలికి గెంటి తలుపువైచికొందము. పాటగాఁడు రాకుం
డనే యీశవ మావలికిఁ బోవలయును.

చంద్ర—(అప) సరే నడు. (వేశ్యమాత నిష్క్రమించును.)

చంద్రి—నారాయణరావు! నీరసముగా నున్నావేమి? కునికిపాట్లు
పడుచుంటివేమి?

నారా—ఈరాత్రి భోజనము చేయలేదు.

చంద్రి—(పాత్రిలో సారాపోసి) ఇదిగో! ఒకపట్టు పట్టు.

నారా—(త్రాగును.) బేవు. (తేన్చును.) బాగుగనే యున్నది. గాటు
గానే యున్నది. ఆగాటులో మోతాదైన కమ్మఁదన మున్నది.
అంతేకాని గొంతుకలో వెక్కిమంట లేదు. గొంతుకలోనికి
జరజర సాపుగా దిగిపోయినది కాని యెక్కిలికాని యెగుపుకాని
యేమియు లేదు.

చంద్రి—మఱియొకవంపు వంపవోయి.

నారా—అక్కఱలేదు. నరములకు చుఱుకైన గమనిక, కదలిక కలి
గినవి. చంద్రోదయమైనట్లు స్వచ్ఛముగాఁ గనఁబడుచున్నది.
ప్రకృతియంతయు క్షౌరముచేయించుకొన్నట్లు నున్నగ నున్నది.

చంద్రి—ఇఁక రెండుపీల్పులు పీల్పవోయి పెద్దమ్మా!

నారా—(త్రాగును.)

చంద్రి—ఇప్పు డేలాగున నున్నది?

నారా—ఆ— (దీర్ఘముగా సుతివేయును.)

పదము.

సానిదాని దెచ్చినాఁడు సంతలోఁ బెట్టినాఁడు
గోనెగుడ్డ గప్పినాఁడు కోకకొంగు లాగినాఁడు—
వాః వారేవాః వారేవాః

ఇదిగో మీసము. పదునల్గురు ముండల నుంచుకొందును. హే. హే. హే. తమాషా (తూలుచున్నాఁడు.) ఉండరా లంజకొడుకా! మీఁదఁ బడెద వేమిరా? ఆఁగు. అక్కడనే యాఁగు. తాగి తెలియతక్కలాడుకున్నా?

చంద్ర—ఏమి యాయల్లరి? నారాయణా! ఆవలికిఁ బో.

నారా—నేను బోను. నేను బోను. పొమ్మనుట కెవ్వని కధికారము లేదు. నాకొంప నాగోడి—నాదూడ నాదుడికి—నాయిల్లు నావాఁకిలి. నీ వాఁడుదాన వైనయెడల నేను మగవాఁడను. మగవానికి మీస మెంతడాబో యాఁడుదాని కదిగో! అది యెంత డాబు—హే హే హే! దానిపై రెండులకుఁ దలపెట్టలేదో మొఱుఁగుదువా? అసభ్యము—ఎవరికి? చదువుకొన్న నపుంసకపుముండకొడుకులకు— హే హే! మాకు పుంస్త్వవృద్ధికి మందెందులకు?

చంద్ర—పో— ఆవలికిఁ బో.

నారా—దండాలు. నీపాదాలకు దండాలు. నీయమ్మకడుపు చల్లగా, నీయత్తకడుపు చల్లగా వేయేండ్లు వర్ధిల్లు. బ్రాహ్మణులమాన్యాలన్ని వేసికో— వేసికో నీసిగగోయ. అమ్మవారిజాతరకు సిడిబొమ్మను ద్రిప్పినట్లు గిరగిర ద్రిప్పినయెడల—ఓ—అంకులరాట్నమంత సొగసు. (తూలుచున్నాఁడు.) ఎక్కడఁ జూచిన నెత్తుపల్లమే కాని సాపైనదారియే కనఁబడదేమి? ఎవఁడురా నన్ను ముందుకుఁ ద్రోయుచున్నాఁడు? ముండకొడుక! డొక్కచీల్చి రాలు గొట్టెదను.

చంద్ర—అమ్మా! నీ వీతని చేయి పట్టుకొని యావలికిఁ దీసికొనిపొమ్ము.

(వేశ్యామాత ప్రవేశించి నారాయణరావుచేయి పట్టుకొనఁబోవును.)

నారా—వాఁ రేవాః, వాఁ రేవాః

పదము

నెత్తిమీఁద ముగ్గుబుట్టోయి నాసామి
కంటిలోను ప్రత్తికాయ
మేఁకలాగునఁ జిన్నగడ్డం నాసామి
కాకిబొడ్డు మేనిరంగు
నోటిలోను జుట్టుపీకోయి నాసామి
గుండెమీఁద గంగడోలు
వీపుకింద నులకముకొక్కోయి నాసామి
పుక్కికింద కంటికుక్క

హోహో. చూచినావా! సరస్వతివి! గ్రామ్యభాషాసరస్వతివి నీవే! నీయాశ్రితులము మేము నాకవితాధార కనిష్పత్తివా. ఇంతధార గంగాప్రవాహమువలె నాకెట్లుకుఁ గలిగినదో యెఱుఁగుదువా? వేశ్య నుంచుకొనుటచేత—అని నా నిశ్చితము—హో హో హో—కాళిదాసున కెట్లుకుఁ గలిగినది? ధూర్జటికవి కెందఱకుఁ గలిగినది? నిజమైనకవితాధార గలయందఱకుఁగూడ సానిసంపర్కము తప్పితద్దినములాగునఁ దప్పదు. ఒక్కటే శాసనము. కైలాసము మొదలుకొని రావణాసురుని కాష్ఠమువఱకు.

వేశ్య—నీవు మాటలాడక నాతో రా. (లాగును.)

నారా—నీతో రానా! నీకల్లిసిగ సరగ- నీ యా స్నేకుడ- నావయ స్నేకుడ! ఎంతయేతము పెట్టుగాఁ జెప్పినావు! దేండ్రి సుబ్బన్నమాట యేమి చెప్పినావు? ముసలి అబ్బాయిమాట యేమి చెప్పినావు? నా బిడ్డలను వదలుకొంటి నను మహాశాసనము

వ్రాసి న్యాయసభలోఁ బెట్టి దర్భశయ్య వేసికొని పండుకో. అప్పుడు నాపౌరోహిత్యము. జీవప్రాయశ్చిత్తము చేయింతునో కాక గర్భాధానపుమంత్రమే చెప్పుదునో నాతమాషా!

చంద్రి—అమ్మా! త్వరగ సాగనంపవేమి? నీవుకూడ వినోదము చూచుచుంటివా యేమి?

వేశ్య—నీ వల్లరి చేయుచున్నావు. వీథిలోనికిఁ బో! లేనియెడలఁ జీపురుతోఁ గొట్టెదను.

నా—చీపురుతో నీవు నన్నుఁ గొట్టినయెడల నేను జెప్పుతోఁ గొట్టనా? ఆమాత్రపుఁ బౌరుషము లేదనుకొన్నావా? నిముండమోయ. రా. కట్టు— కానీకొక కట్టు— రా. నాపంజాబీ మైసూరీ తడాఖా చూతువుగాని. (దండమీఁదఁ గొట్టుకొనును.) పట్టు. ఇదిగో, ఈలాగున నోడుపుపట్టు— కోడిపందెపుఁగాపు చూడలేదా? నే నట్లు కాపు కాచితిని. నీ వొత్తిగిల్లు. అయ్యో! నీతల గొరగ. ఒల్లిగిల్లవేమి? (తన్నును.)

వేశ్య—ఓరిగాడిదకొడుకా! ఎంతతన్నుఁ దన్నితివిరా— నీకాలు తెగిపోను. (చీపురుకట్టతోఁ గొట్టును.)

నా—అమ్మ నీగొంతుగోయ! పర్వతమును వజ్రాయుధముతో దేవేంద్రుఁడు గొట్టినట్లు కొట్టితివే. ఏ ఏ! తెక్కలూడలేదు గాని మొక్కల్లమాత్రము వచ్చినవి. ఏ.ఏ! కొట్టినదెబ్బ గుండె కరఁగఁదట్టినది. ఏ ఏ! పన్నాలు లేవేమో, యెక్కడను మంచినీళ్లు దొరకకుండ నున్నవి. ఎంతసామంతమైనను జిగురుసారాది. నాలుక పీకికొనఁదగిన ట్లున్నది. తాటికల్లు—యీఁతకల్లున్నవే— ఇవి రొట్టకొట్టు— పాటకపుజాతికొఱకు. బ్రాహ్మణునకు మాత్రము చిగురుసారా పెట్టినది పేరు. వడికి తగ్గు లేదు. విలు

వను తెచ్చలేను.. అది యుగ్రజాతి కన్నివిధములచేతఁ దగి నది. ఇఁక జమీందార్లు! అబ్బ! నిష్టకోళ్లు! వారిప్రాగుడు ముందు మాది చచ్చు—చచ్చుము స్వాతిక—సరాసరి! నీవుబుద్ధికిబుద్ధి యొక్క-గుర్రిక్క-లో వంపుపెట్టినజమీందారుఁ డున్నాఁడే— అతనిబ్రికు కే బ్రికుకు— బ్రహ్మజ్ఞానికి దేహాభిమానముండను అతనికి నుండగు. ఒళ్లు చీకినసరే— తగులఁబెట్టినసరే.

చంద్రి—అమ్మా! ఇఁక తెంపుకొట్టి యావలికీడ్చివేయక ఘాచెదవేమి?

వేశ్య—(చీపురుతోఁ గొట్టును.)

నారా—ఆహాహా! బ్రహ్మాస్త్రప్రయోగ మైనట్లున్నది.

(వేశ్యమాత గెంటుమన్నది. నారాయణరావు గుమ్మమున కావల క్రిందఁ బడును. వేశ్య తలుపు వైచుకొనును)

నారా—(లేచుటకుఁ బ్రయత్నించి లేవలేక రెండుమారులు పడి లేచును.) దీనిని జంపి చాకిరేవుబల్లమీఁద నారాపోసి యెముకఁదీసి యెముకఁదీసి యెముకలమునకుఁ బుట్టినముసలమునువలె గోదావరిలోఁ గలిపెదను. అంతమట్టుకు సంకల్పించుకొన్నఁగాని పనిజరుగదు. వేశ్యాకులమున కెల్ల నిదే కీడు. ఈకీడు దీసిన ఖ్యాతి నాకుఁ గలుగవలెను. ఎవఁడో నాయొద్దకు వచ్చుచున్నాఁడు.ఎవఁడవురా నీవు—నీయూరేదిరా—నీపేరేదిరా? డొక్క చీల్చి రాలు నొక్కెదను.

(ఒకరక్షకభటుఁడు ప్రవేశించి యీలవైచును.)

నారా—అదిగో. ఆలాగున నుతిపట్టు. ఇఁక నామేజువాణి చిత్తగించు.

(మద్దెలకు దండముపెట్టి రక్షకభటునకు దండముపెట్టును.)

కీర్తన—కాంభోజి.

ఉన్నమగతనమెన్న సున్నకుసున్నైన
వన్నెల చిన్నెల నెన్నఁదరమటే!

(పాడి యభినయించును.)

నాతిననుభవింపఁ జేతగానినీకు మూతిపైమీసాలు ప్రేతపైఁబూవులె॥
ఉన్న॥

సుశీమానిని వెందుచేత ? నెత్తిమీఁద టంగునఁ దాళపుచిప్ప తోఁ గొట్టెదను. (రక్షకభటుని నెత్తిపైఁ గొట్టును.)

(రక్షకభటుఁడు వానిని బట్టుకొన యత్నింప నతఁడు పరుగెత్తును. ఇంతలో మఱియొకరక్షకభటుఁడు ప్రవేశించును.)

2 ర—బ్రాహ్మణుఁడా! నీ వెవఁడవు ?

నారా—నేను జంద్రరేఖమగఁడను.

1 ర—చంద్రరేఖ కెందఱున్నారో— వారిలో నీ వెవఁడవు ?

నారా—వాచాదోషములు. జాగ్రత్త. మూఁతిపైఁ గొట్టెదను.

2 ర—అయ్యయ్యో! ఇతఁడు మనపెద్దశాస్త్రులుగారికొడుకురా!

1 ర—ఎవఁడైన నేమి- కొట్టులో నుంతము.

నారా—నన్నుఁ బట్టుకొందురా ? ఏది పట్టుకో— (పరుగెత్తఁబోవును. తూలి క్రిందఁ బడిపోవును.)

2 ర—రామరామా! వీనియిల్లు నే నెఱుఁగుదును. అక్కడకుఁ దీసికొనిపోదము. పట్టుకో— మన కెప్పటిఋణసంబంధమో!

(ఇద్దఱు పట్టుకొని నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

శ్రీరామా!

# రాతిస్తంభము.

## తృతీయాంకము.

ప్రదేశము—నారాయణరావుగృహము.

ప్రవేశము—మంచముపై వెంకమ్మ, క్రింద లక్ష్మి.

వెంక—ఇంకను లేవలేదా?

లక్ష్మి—లేచి భుజియించి తిరుగఁ బండుకొన్నారు.

వెంక—ఈదుర్గుణముకూడ నున్నట్లు వినలేదు. ఇదికూడ నున్నదా? అయ్యయ్యో! ఎంతమంచివంశములో నెంతదుష్టుఁడు పుట్టినాఁడు! ఆమహాత్ము లదృష్టవంతులు కావున నీయమాంగళ్యమును జూడకుండ వెడలిపోయినారు. నాతను వట్టిపోయినది కాదు. (తలపైఁ గొట్టుకొనును.)

లక్ష్మి—అత్తా! జబ్బుగ నున్నారు. మనస్సున కుద్రేకము తెచ్చుకొనకుఁడు. రోగము హెచ్చగును. భద్రముగా నుండవలయును.

వెంక—రోగము హెచ్చుకావలయు ననియే దేవులాడుచున్నాను. చావవలయు ననియే చేతులెత్తుకొని మ్రొక్కుచున్నాను. ఇప్పుడు సాయంకాలము కావచ్చినదికదా.

లక్ష్మి—ఆఁ.

వెంక—ఇదివఱకు వచ్చిన నాతప్పుడెక్కు వచ్చి యెంతసే పైనది?

లక్ష్మి—రెండుగంటలు కావచ్చినది.

వెంక—నీభోజనమైనది కాదా?

లక్ష్మమ్మ—అయినది.

వెంక—నీభర్త యుదయామునుండియు దానియింటికిఁ బోలే దేమి?

లక్ష్మమ్మ—ఏదీ? రెండుయామములవఱకు వెనుకటితిక్క వదలనే లేదు. లేచి స్నానముచేసి భుజించుటతోడనే తిరుగఁ గునికిపాట్లు రాఁగఁ బండుకొన్నారు.

వెంక—కుఱ్ఱవాఁ డెచ్చట నున్నాఁడు?

లక్ష్మమ్మ—తోఁటలోఁ బండుకొన్నాఁడు.

వెంక—ఇంటిదాసి వచ్చినదా?

లక్ష్మమ్మ—వచ్చినది.

వెంక—ఈరాత్రి యిచ్చటనే పండుకొనుమని దానితోఁ జెప్పవలయు నుజుమా.

లక్ష్మమ్మ—అట్లా! చెప్పితిని.

వెంక—ఉదయమున వచ్చిన వైద్యుఁ డేమన్నాఁడు?

లక్ష్మమ్మ—ధనుర్వాతమని యన్నాఁడు.

వెంక—అది యపాయకరమైన వ్యాధియే యని చెప్పినాఁడా?

లక్ష్మమ్మ—కొందఱకు నిమ్మళించిన దని చెప్పినాఁడు.

వెంక—దానికేమికాని యావైద్యుని రాత్రి యొకసారిరమ్మని చెప్పితివా?

లక్ష్మమ్మ—రాత్రి వచ్చెద నని యాతఁడే చెప్పినాఁడు. కాని యాతని మందు మీరు పుచ్చుకొనలేదుకదా— వైద్యుఁ డెందులకు?

వెంక—మందుపుచ్చుకొన్న యెడలఁ గుదురునేమో యనుభయముచేతఁ బుచ్చుకొనకపోయినను వైద్యుఁడు రాత్రి యొకసారి వచ్చునెడల

నా ప్రాణోత్క్రమణసమయ మెప్పుడో చెప్పిన యెడల నీవు జాగ్రత్తగా నుండఁగలవని—

లక్ష్మి—అత్తా! అదేమిమాట? మీకుమామఁ డిక్కడనే యుండును గాదా?

వెంక—ఉండు నని చెప్పినాఁడా?

లక్ష్మి—లేదుకాని మీ కింత జబ్బుగానుండఁగా దానియింటికిఁ బోవ రనుకొందును.

వెంక—ఇంత కాదు. ఇంతకంటె శీతగుణములు జబ్బుగానున్నను వాఁడు పోకమానఁడు.

లక్ష్మి—అదిగో మీకుమామఁడు వచ్చుచున్నారు.

(నారాయణరావు ప్రవేశించును.)

నారా—నీ కేమి మతియున్నదా లేదా? రెండవసారిపండుకొన్నప్పుడు రవంత లేప లేకపోయినావా?

లక్ష్మి—బడలియున్నా రని యూరకుంటిని. క్షమింపవలయును.

నారా—అమ్మా! ఏలాగున నున్నావు? మఱేమియు భయము లేదులే. ఊరక బెంగపెట్టుకొని యేడువకు. ఈముసలివాండ్రకుఁ జావనఁగ నింతయంత భయము కాదు. ఈధనుర్వాతరోగము పైకి భయంకరముగాఁ గనఁబడుటయే గాని యపాయకరమైన రోగము కాదు.

లక్ష్మి—తఱచుగా నపాయకర మనియే వైద్యుఁడు చెప్పినాఁడు.

నారా—డబ్బుకొఱకు కల్లు చెప్పుదురు. వైద్యుల డాబుమాటలకు మోసపోవలదు. చంద్రరేఖతల్లి నాగిముండకు సరిగా నిదియే రోగము. ఒకదినముకాఁబోలు నులకకుక్కిమీఁద నున్నది. రెండవదినమున మొన్నలాగున నింటిలోఁ దిరిగినది. ఇదివఱకే

లేక లేదని దేవులాడిన వాఁడనుగదా? ఇఁకనైనఁ బోవలదా? లక్ష్మి! ఆఁ. ఆ. గట్టిగఁబట్టుకో!

(వెంకమ్మకు ధనుర్వాతము వచ్చినది. నారాయణరావు లక్ష్మియు నామెను పైకి వంగనీయకుండ నొక్కియుంతురు. రెండు నిముసములకు యథాస్థితి నొందును.)

నారా—ఇక్కడికీ పొంగడఁగినది. తిరిగి రాత్రి యిట్లువచ్చునో లేదో చెప్పలేము. నిద్రపట్టినమొదల రాదులే. రేపటినుండి సుఖముగా నుండును. లక్ష్మి! తలుపు వేసికో. వెళ్ళుదును.

లక్ష్మి—(అప) అమ్మగారితోఁ జెప్పకుండఁ బోవుట తప్పుకాదా?

నారా—అమ్మా! నీకేమియు భయములేదు. నేను వెళ్ళుదును.

వెంక—నేను జావ నని శపింపకుము. నేను జావవలయుననియే కోరుకొనుచున్నాను. నన్నుఁ ద్వరగఁ దీసికొనిపొమ్మని మృత్యుదేవతకు మ్రొక్కుకొనుచున్నాను. ఎందుచేతనో యెఱుఁగుదువా? నీయవకతవక చూడలేక, నీయమంగళప్రవర్తన సహింపలేక, నీవలన నీవంశమునకుఁ గలిగిన యప్రతిష్ఠను భరింపలేకచచ్చుచున్నాను. నాచావునకు నీవే కారణమవు. ధనుర్వాతరోగము నన్నేమియుఁ జేయలేదు. మహామారియైన నన్నేమియుఁ జేయలేదు. నీకంటె నాకు మహామారి లేదు. మాతృహంతవైన నీమొగముజూడఁ బాపముకావునఁ బో—

నారా—అమ్మా! ఎందుకీ వెఱ్ఱిమాటలు? మొట్టమొదటినుండియు నీవు నన్నిట్లే వేధించుకొని తింటివి. ఇంటిలోఁ బోరు లేకపోవునా? ఈకొంపకు వచ్చిన దరిద్రతకు నీవే కారణమవు. ఏమో పెద్దది. ఛాందసురాలు. ఆమెకుఁ దోఁచినమాటలు మంచిచెడ్డ లెఱుఁగక పేలుచుండును. ఆమెను ధిక్కరించుట

నీతికా దని నేను నోరుమూసికొని యింతకాలము పడియుంటిని. నన్నూరకుండనీయవే! నానోరు బైట నేలవేయుచున్నవు? డబ్బు లేదు, డబ్బులే దని యూరకుండ యెక్కడ నన్నుఁ గోసికొని తినుచున్నందులకే యేడ్వనా? రాకరాక మొనకుల కింటికి వచ్చినప్పుడు నీవు నన్నుఁ గొడుకని—ప్రేమయని—నాపిండకూ డని—నల్లముడుగనియు లేకుండ సాధించుచున్న సాధింపులకే యేడ్వనా? ఈబాధపడలేక, సంతతమైన యీఱంపపుఁగోఁత కోఁగలేక యేదో రవంతసేపు మైమఱపుగా నుండునని, కాసం తసే పుత్సాహముగా నుండు నని నాల్గుమక్కులు—వెగటుపడి వెగటుపడి—బలాత్కారమున గొంతుకలోఁ బోసికొనుచు న్నాను. అది యొకతప్పా? నాతలమీఁద నెగిరిపోయిన వా రెందఱెందఱు త్రాగుచున్నారో యెఱుఁగుదువా? త్రాగినం దువలన గౌరవహాని యెవ్వరికి లేదు. త్రాగినందువలన నింకను గౌరవవృద్ధిమైనవారిని నే నెందఱినో యెఱుఁగుదును. యజ్ఞా దులుచేయు ముండకొడుకులు సోమపానము, సోమపాన మని చెడఁద్రాగి చెడఁద్రాగి శ్రోత్రియు లనిపించుకొనుటలేదా? సోమపత్త్రిరస మెట్టిదో, నాముతాఁడిక ల్లట్టిది. త్రాగనివా రెవ్వరును లేరు. ఉండుట కవకాశమే లేదు. మనమాట లెక్క యేమి? అవతారపురుషులకుఁ దప్పలేదు. బలరాముఁడు చెడఁ ద్రాఁగి తెలివితక్కు లాడలేదా? కృష్ణమూర్తి గొంతుకముడి వఱకుఁ ద్రాఁగి గంతులువేయలేదా? అమృత మమృత మని దేవతలు ద్రాఁగిన దేది? శుద్ధమైన కల్లు. (అప) లక్ష్మీ! రాత్రి నీవస్తువులు హరించితి నని మీయత్తతోఁ జెప్పితివా?

లక్ష్మి—(అప) చెప్పలేదు. చెప్పను.

నారా—(అప) అదే మంచిపని. లేనియెడల నామె యుండుకొంట కొక పెద్దగొడవ చేయును.

లక్ష్మి—(అప) ఈరాత్రి మీరిల్లు కదలకుండు. ఎందులకైన మంచిది. భద్రముగా నుందము.

నారా—(అప) ఏమి సీవెఱ్ఱి! ఈమె చచ్చిపోవు నని యనుకొనుచు న్నావా? వట్టిమాట. ముసలివాండ్రకు సకాలమునఁ జావు వచ్చుట యెంత యదృష్టము! అట్టియదృష్టము పట్టదు. నే నెఱుఁగుదును.

లక్ష్మి—(అప) పోనిండు. మఱింత మంచిది—మీ రింటిలో నుండ రాదా? ఆమె మరణింపకపోయినను నే నొక్కతె నామెతోఁ బాట్లుపడఁగలనా? ఆమె కెగుపులువచ్చినప్పుడు నే నొక్కతె నడఁచిపట్టుకొనఁగలనా?

నారా—(అప) మనయింటిలో దాసి నుండు మని చెప్పు. అది రాక పోవునెడల నాగిచెల్లెలు సుభద్ర యనుమంతురసాని యున్నది. దానిని బంపెదను. ఏదో దాని కిచ్చెదము. అంతేకాని నీ వొక్కతె వుండు మని నేను జెప్పుదునా?

వెంక—వెళ్లినాఁడఁటే?

లక్ష్మి—లే దత్తా! ఇక్కడనే యున్నారు.

వెంక—వెళ్లకపోయితి వేల? నీకు భార్య కావలయునా? బిడ్డ కావలయునా? కన్నతల్లి కావలయునా? ఒక్కముండతక్క—నీకే మియు నక్కఱలేదు. తల్లి కిక్కడ రోగము—కొడుకున కక్కడ భోగము. తల్లి కిక్కడ నేడ్పు, కొడుకున కక్కడ సంతోష ము తల్లి కిక్కడ భూశయనము- కొడుకున కక్కడ వేశ్యా

శోహంశయనము. తల్లి కిక్కడ నవసానగంగోదకపానము, కొడు
కున కక్కడ సురాపానము. అది కాక—

నారా—అమ్మా! ఇన్నిమాట లింతపొందికగాఁ జెప్పినదానవు నీకు
రోగ మేమిటి- నా శ్రాద్ధము. నీకు రోగ మనుకొన్నవారికి
రోగము. చావుచావని సులభముగా నందువు కాని యదిమా
త్రి మంత పైపై నున్నదా- అమ్మా!

లక్ష్మి—(అప) నాథా! తల్లిగారి నట్లనుట తగునా? ఆ మెచిత్తము
నొవ్వఁదగదు.

నారా—(అప) ఛీ గాడిదా! నోరుమూసికో- నీకెందులకు?

వెంక—ఏమంటివిరా? పశువా! శుంఠా! నాది దొంగరోగమా?
నే నెందుల కీదొంగతనము చేయవలయును? నీవేశ్యతో
నీ వెంత సౌభాగ్య మనుభవించుచున్నావో నేను నాదాసిని,
లక్ష్మియైన నెఱుఁగకుండఁ, బంపి కనుఁగొనుచున్నాను. అం
తవఱకు మఱియొకనితోఁ గులికి కులికి హాస్యహాస్యనుచు నీవ
లికి నీయొద్దకు వచ్చి కాళ్లునొవ్వులని యది దొంగరోగ మభిన
యింప నీవు శ్రీరామనవమినాఁడు దానికాళ్లు లొత్తలేదా?
అదిగో! దేవతార్చనలోనున్న సీతారామమునకు జోడింపవల
సిన నీచేతులు—కన్నతల్లికాళులపై రాయవలసిననీచేతులు—
పితృదేవతలతర్పణకాలమందుపయోగపడవలసిన నీచేతులు—
గుడిసెవేటుముండకాళులు పిసుకుట కక్కఱకు వచ్చినవా?
నీచేతులు తెగిపోను. నీతండ్రికంటె, నీతల్లికంటె, శ్రీరామ
చంద్రమూర్తికంటె నదియే నీ కుత్తరగతిప్రదాత్రి యని దాని
కాళులఁ బడితివా? నీబ్రదుకు మండిపోను. నీవు తండ్రి కర్మ
మాయ నక్కఱలేదు- తల్లి కుపచారముచేయ నక్కఱలేదు,

శ్రీరామచంద్రమూర్తిని స్మరింపనైన నక్కఱలేదు. అదిగో. అదిగో! ఆమహాతేజస్విని! ఆపతివ్రతాశిరోమణి! నోటిమాటలైన నెఱుంగని వట్టిగోల! సంతతభగవచ్చింతాపరాయణయైన భక్తురాలు! ఆమెకాళ్లపైఁ బడి 'నేను ద్రోహిని, నన్నుఁ గటాక్షింపు' మని యేడ్వుము. నీసర్వపాపములు నశించును. మహాపతివ్రతాసేవకంటె, భగవత్సేవ యెక్కువది కాదు. నీవట్లు చేయవా? పో. నాకుఁ గొడుకు లేఁడు. నాకుఁ బుట్టిన దిదిగో! ఒక్కతయే కూఁతురు. ఇదియే నాబ్రతుకు పరిసమాప్తి నొందించును.

నారా—నీయిష్టము. నేను నీకు లేనప్పుడు నేనుఁ జేయఁదగిన దేమున్నది? చావఁదలఁచినవారి కెవ్వరుఁ జేయవలసినది యేమియు లేదు. నే నిక్కడ నుండను.

లక్ష్మి—నాథా! అమ్మగారియిష్టము ననుసరించి యిచ్చట నుండఁ గోరుచున్నాను.

నారా—ఉండవలయుననియే యున్నదనుకో—ఈమె కుట్టుమాటలు సహింపలేకుండ నున్నాను. నే నిచ్చట నెట్లుండఁగలను?

వెంక—నీబాగును గోరి—కొడుకవైన నీకుఁ జోడపై నాశిర ముండఁగా నేను బ్రాణము విడిచితినన్న మాటలైన నీకుఁ దక్కింప నెంచి నిన్ను నేను దిట్టినతిట్లు సహింపలేవా? వేశ్య కొట్టిన చీఁపురుదెబ్బలు— అదిగో— కుడిప్రక్కను— అవి సహింపఁగలవా? ఇంకను దానియొద్దకే పోవ నిశ్చయించుకొంటివా? చెప్పుకంటెఁ జీపురే యధమము. ఈసారి దేనితో దెబ్బలు తినుట కక్కడకు వెళ్లుచున్నావు?

నారా—ఈదెబ్బలు తిని నే నూరకుండలేను. నేను గొట్టకమానిని

ననుకొంటివేమి ? ఆతరువాత నింకజరుగవలసిన గ్రంథముకొ అకే యిప్పుడు పోయెద ననుచున్నాను. నన్నువ్వ రక్షపెట్టవలదు. నేను గాశికి పోవుదునా ? రామేశ్వరము పోవుదునా ?

వెంక—ఛీ! తుచ్ఛుఁడా ! నీబ్రిదుకునకు కాశీరామేశ్వరములుగూడనా !

నారా—నే నిచ్చట నుండను. లక్ష్మీ ! వింటివా. ఇంటిలో దాసియో మఱియొక తెయో యిక్కడ నుండును గావున రవంతత్వొందరగానున్న దని తెలిసినప్పుడు నాకు దాసిచే వార్త పంపునెడలఁ బరుగెత్తుకొని వత్తును. చీటికిమాటికిఁ దొందరపడి, మీరు శ్రమపడి నన్ను శ్రీముపెట్టవలదు. నిన్నరాత్రి నిద్ర లేదు. దాని యింటితలుపు గట్టిగఁ గొట్టినయెడల నే నటనే పండుకొందును గావునఁ దలుపు తీయుదురు. మరేమియు భయము లేదు. అన్నియు బాగుగనే జరుగును. అమ్మా ! నేను వెళ్ళుకునా ?

వెంక—నన్నడుగ నేల ?

నారా—తప్పనిసరిగఁ బోవలసివచ్చినది.

వెంక—నీతండ్రి పరమసాధువు. మహాపండితుఁడు. నేను బతివ్రతను. సప్నమందైనను బరపురుషసందర్శన మెఱుఁగను. అట్లుకాక నేను వ్యభిచారిణినై యుండునెడల నీవు నీతండ్రికి పుట్టక మఱి యెవ్వరికో పుట్టితి వని నేను నిశ్చయించుకొనియుందును. ఇట్టి తండ్రికి, నిట్టితల్లికి నిట్టికొడుకవు పుట్టితివి. తల్లిదండ్రులకుఁ గొడుకులకు గుణములలో సంబంధ ముండక తీర దనుమాట తప్పు. మేము నిన్నుఁ బుట్టింపలేదు. నీప్రారబ్ధము ననుసరించి నీవు మాగర్భములఁ బడితివి. మాప్రారబ్ధముననుసరించి నిన్నుఁ

గంటిమి. ఇంక నీకర్మము నీదే—నాకర్మము నాదే—నిన్ను నే నింకఁ జూడను—పో.

నారా—ఉన్నకొలఁది నొక్కటే వెళ్లిపోరణి. (పోవును.)

లక్ష్మి—అచ్చీ—అచ్చీ—(అచ్చి ప్రవేశించును.)

లక్ష్మి—అచ్చీ! నీ వెక్కడ నుండుము. ఈరాత్రి యిక్కడనే పండు కొనుమని చెప్పితినిగాదా?

అచ్చి—అట్లే పండుకొందును. నా కేమియుఁ గష్టము లేదు. అమ్మా! బాబుగారు వెళ్ళినారా?

లక్ష్మి—(అప) వెళ్లినారు. అచ్చీ! నీవు చచ్చిపోవువారియొద్దనుండి యెప్పుడైన జూచితివా?

అచ్చి—(అప) చూడ కేమమ్మా! నామగండు పోవుచుండగాఁ జూచితి నమ్మా!

లక్ష్మి—(అప) ఏమైనఁ గష్టపడినాఁడా?

అచ్చి—(అప) ఒడలు తెలియనికష్ట మమ్మా! బుసబుసలాడుచు శ్లేష్మము పొంగినది. కాళ్ళు చేతులు కొట్టుకొనినాఁడు—ఏమో కొంతసేపట్లు కొట్టుకొన్నతరువాతఁ జూడగ వట్టికొయ్య. ఈ ప్రాణాలను నమ్ముకొన్నంత పామరత్వము లేదమ్మా—

వెంక—లక్ష్మీ! వెళ్లినాఁడా!

లక్ష్మి—ఆ.

వెంక—తరువాతఁ గష్టమగును గావున నే నిప్పుడే క్రిందఁ బండుకొందును. చాప తెచ్చి పఱపుము.

లక్ష్మి—అత్తా! తప్పు కావా.

వెంక—తప్పింతమాత్రము లేదు. నాకు స్మృతి లేకుండునప్పుడు నీవు

నన్నొక్క తెవు క్రిందికి దింపలేవు. అప్పు నన్ను ముట్టకొనఁదగను. అందుచే నాచాప పఱపుము.

లక్ష్మి—అటులే (పఱచును.)

వెంక—వంటయింటిపంచపాళిచూరున దర్భలున్నవి. తీసికొనివచ్చి తలవైపునఁ బెట్టుము.

లక్ష్మి—(అట్లు చేయును.)

వెంక—అమ్మా! నాకు రవంత చేయూఁతనిచ్చినయెడల నేను క్రిందఁబండుకొందును.

లక్ష్మి—(అట్లు చేయును.)

వెంక—(నారాయణనారాయణ యని స్మరించుకొనుచుఁ బండుకొనును)—నాకు మైమఱపు హెచ్చగుచున్నట్లున్నది. ఆఁ. ఔను. నీవు కట్టుకొన్నది పట్టుబట్టయే కాదా?

లక్ష్మి—అవును.

వెంక—దేవతార్చన వేదికయొద్దకుఁ బోయి—గంగోదకమున్నది—అక్కడనే తులసీదళము లున్నవి తులసిని దొన్నెలో వేసి గంగోదక మందులోఁ గొంతపోసి—యిటకుఁ దీసికొని రా. ఇంతలోఁ దొందర లేదుసుమా! ఎఱుఁగనిదాన వని, నాకు స్మృతిలేనప్పుడు నీకుఁ జెప్పువా రుండరని యిట్లు చెప్పుచున్నాను.

లక్ష్మి—(పోయి గంగోదకాదులు తెచ్చును) అమ్మా! అన్నియు సిద్ధముగా నున్నవి.

వెంక—ఆలాగా—తల్లీ! సంతోషము. గడియ కొకటిరెండు పర్యాయములు తులసితీర్థము నానోటిలోఁ బోయుచుండుము, స్మృతి యున్నంతవఱకు నేను నారాయణస్మరణము చేసికొందును

గాని యదిపోయినపిమ్మట నీవు నాచెవిలో 'నారాయణా' యని స్మరించుచుండుము.

లక్ష్మి—అత్తా! అట్లే చేసెదను.

వెంక—తల్లీ! నాకొడుకు చేయవలసిన సమస్తోపచారములు నీవు చేయుచుంటివి! అంతమందక్కఱకు వచ్చువాఁడే కొడుకు. నల్వురు కొడుకులున్న దశరథుఁ డగతికముగఁ జావలేదా? ఇఁక నాలెక్క యేమి? తల్లీ! నీ వున్నావు. అంతేచాలును. మనభారతదేశము కడుపుచల్లగఁ గన్నయుత్తమకాంతలలో నీ వొక్కతెవు. నీవు చేయుచున్న యీలోకోత్తరసేవకు నీపై దేవతలు పుష్పవృష్టి గురియింపవలసినది.

అచ్చి—అమ్మా! వైద్యుఁడుగారు వచ్చుచున్నారు.

(వైద్యుఁడు ప్రవేశించును.)

వెంక—అయ్యా! మీరు శ్రమపడి వచ్చినారు. చాల సంతసించితిని. మీ రింక నాకుఁ జేయు నుపకార మేదియు లేదు. నన్నుఁ బరీక్షింపనక్కఱ లేదు. నేను మూటముల్లె కట్టుకొని యాత్రోన్ముఖురాలనై యున్నాను. నాకు గుండె లెగసి యెగసి పోవుచున్నవి. స్మృతితప్పుటకు సిద్ధముగా నున్నట్లున్నది.

వైద్యుఁడు—సరే. నేను బోవుదును. (పోఁబోవును.)

లక్ష్మి—(అప) నాయనా! ఈమెప్రాణము పోవుసమయము నాకెట్లు తెలియును?

వైద్య—(అప) అది యెవరు చెప్పఁగలరు?

లక్ష్మి—(అప) మీకుఁ దెలియకపోవునా? ఇదిగో- ఈచిహ్న మారంభించినపిమ్మట నింక కొంతసేపటికిఁ బ్రాణము పోవునని మీరు చెప్పలేరా?

వైద్య—(చూచి) గుండెలు తీవ్రముగాఁ గొట్టుకొనుచున్నవి. అది మెదడు-వజబ్బు. అట్లు కొట్టుకొని, కొట్టుకొని యొక్కసారి యాఁగిపోవును. అప్పుడే విస్మృతి కొంత యారంభమైన ట్లున్నది. ఈవిస్మృతి దాదాపుగా రెండుగంట లుండును. అప్పు డామె నుదుటిపై యిందువగింజలవంటి చెమటబొట్లు నాలుగో యైదో కనఁబడును. అటుపై నొక్కగడియకంటెఁ దనువునిలువ దని నిశ్చయించుకొనవలయును.

లక్ష్మి—చిత్తము. నాకు సెలవు.

(వైద్యుఁడు నిష్క్రమించును.)

అయ్యో! అయ్యో! పలుకకున్నది. విస్మృతి గలిగినది. ఇఁకను రెండుగంటలు వ్యవధియున్నదికదా! ఈలోపల నీమెయొద్దఁ గూర్చుండి నారాయణస్మరణ చేయుచుఁ దులసితీర్థము నోటఁ బోయుచుందును. (అట్లు చేయును.) (ఆమె చెవిలో) నారాయణా! నారాయణా! అచ్చీ! కుటికిపాట్లు పడుచున్నావు. కొంత సేపు నడుము వ్రాల్చుము.

అచ్చి—నిద్రలే దమ్మా!

లక్ష్మి—అచ్చీ! నే నొక్కపనిఁ జెప్పెదను; చేసెదవా?

అచ్చి—అమ్మా! ఇక్కడ నున్న దందుకొఱకే కాదా?

లక్ష్మి—నీవు చంద్రరేఖయింటికి రాత్రి వెళ్ళఁగలవా?

అచ్చి—వెళ్ళఁగలను.

లక్ష్మి—చూడు. నీవు వెళ్లుదువా నేను వెళ్లనాయని చూచుచున్నాను.

అచ్చి—మీ రెందులకు? నేను వెళ్లుదును.

లక్ష్మి—(తనలో) నే నీమె కెంతసేవఁ జేసినను నామెకుఁ గొడుకుమీఁ దనే తృష్టియుండక తప్పదు. కొడుకు నొడిలోఁ బండుకొని

ప్రాణము విడిచినఁగాని యీమె కుత్తరగతికిఁగూడ భంగము కల్గునేమో యని యనుకొనుచున్నాను. ఆ వాంఛ తీరకపోవుటచేత దానికొఱకు మఱియొకజన్మ మెత్తవలసివచ్చునేమో? కొడుకు కూరనుండఁగా నేను సాహసించి నాతోడపైఁ బండఁబెట్టుకొనఁదగదు. అదిగాక యవసరమైనప్పుడు దాసిని బాపుమని యాయన చెప్పినారు. కాని దాసిని బంపునెడల నట్టిదొందర లేదని యెంచి యాయన రాకుండునేమో? అందుచేత నేనే పోవలయును. 'నీ వేల వచ్చితి' వని నన్నుఁ దిట్టునేమో? తిట్లకు సహించియైనఁ బోవలసినదే. కాని మానవలసినది కాదు. నేను వెళ్ళినను నాభర్త రాకుండునెడల నాలోప ముండదు. తరువాత భగవదిచ్ఛ యెట్లుండునో యట్లుజరుగఁగలదు. కాని యిట్టిసమయమున నత్తగారిని విడిచిపెట్టఁ దగదేమో? ఈకను విస్మృతి రెండుగంటలదాఁక నుండునని వైద్యుఁడు చెప్పినాఁడు. ఈలోపలఁ దొందరయుండదు. కావునఁ బోవుదును. (కన్నీరు) అచ్చీ! నే నిప్పుడే మీబాబుగారినిఁ దీసికొని వత్తును. నీవు భద్రముగా నుండుము. ఇదిగో! ఈతలుపు వైచికొనుము.

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.



శ్రీరామా !

# రాతిస్తంభము.

## చతుర్థాంకము.

ప్రదేశము—చంద్రరేఖగృహము.

ప్రవేశము—వేశ్యామాత, నారాయణరావు.

వేశ్య—చెపఁదాఁగి నన్నుఁ దన్ని, చెంద్రి నష్టమైన తిట్లు తిట్టి దొడ్డి తలుపుతీసి పాఱిపోయితివా ? నీకొఱకై వీధియంతయు నేను గుజ్జుదియు దీపాలతో వెదకితిమి. నీమీఁదఁ జెంద్రి కెంతకోపముగా నైన నున్నది.

నారా—నీసేవచేసినయెడల నామెకోపము తీఱిపోవునుగాదా ! ఏది ? నిన్నుఁ దన్నితినా ? పాపము. ఎక్కడ ?

వేశ్య—ఇదిగో- ఇక్కడ.

నారా—అయ్యో ! అమృతాంజనము రాచి కాఁచెదను.

వేశ్య—కాఁపెందులకుఁగాని పైని మర్దనచేయుము.

నారా—(వేశ్యకాలిమీఁద రాయుచు) నాగమ్మా ! చంద్రరేఖకుఁ గోపముపోవునట్లు చేయవలయునుజుమా !

వేశ్య—ఏదీ ! ఏదైనఁ జేతిలో పైచి మాటలాడుము.

నారా—చుట్టలకట్టకంటె నేమియు లేదు.

వేశ్య—నీపతివ్రత మండిపోను. అదే యిల్లు పాలువేయుము.

నారా—(ఇప్పుడు గట్టిగ మర్దనచేయును.)

వేశ్య—నీగొంతుగోయ. అంతగట్టిగ రుద్దెదవేమి? (తన్నును)

నారా—(నులకమంచముమీఁద యాథాలాభముగఁ గూర్చుండఁబెట్టి క్రిందఁ బడును.) దిక్కుమాలినముండ! తన్నెదవా! నీతల పగుల—

వేశ్య—నాకాళ్ళు పట్టినపందవు. నిన్నుఁ దన్నినఁ దప్పేమి?

నారా—నీసిగఁదరగ! నీకాళ్లకు మంచురాచితినిగాని నీకాళ్ళు పట్టితి నా? మాయమ్మ కాళ్లుచేతులు గిజగిజ కొట్టుకొనుచు దేవు లాడుచుండఁగా నట్టె యామెకాలిమీఁదఁ జేయివైవలేదు. ఈ ముసలి మొగపుముండకాళ్ళు పట్టితినఁట!

వేశ్య—అది యేమో గొప్పతప్పులాగున ననుకొనుచున్నావా? నీవు నాకంటె గొప్పవాఁడ ననుకొనుచున్నావు కాఁబోలు. నీగొప్ప తనము మండ! నీకేమున్నది? ఇల్లూడినదికదా! మాన్య మూడినదికదా! ఇంటిలో గుల్లలూడినవికదా! ఉంచుకొన్న దాని సాపాటునకైన నిచ్చినఁ గలదు లేకున్న లేదు. నీబ్రదుకు నాబ్రదుకువంటిదే కాదా? ఆటకత్తెకు వయస్సెట్టిదో మగవానికి ధనమట్టిది. నీధనము దగ్ధపటమైనది. నావయస్సు వల్లకాఁడైనది. విత్తములేనివిటుఁడు మగవేశ్యామాత యన్న మాట. అదిగాక— నాప్రాయపుదినములలో నే నీయాంధ్ర దేశమున కంతకుఁ గిరీటములేని చక్రవర్తినివలె నుంటిని. నాచిఱునవ్వుకొఱకు లక్షాధిపతులు కనిపెట్టుకొని యుండెడు వారు. కోటీశ్వరులను దన్నినయీకాలితో నిన్నుఁ దన్నఁగ నాకాలు చెడిపోయిన దని నే నేడ్చుచున్నాను. నీకు నాతాపు

తో స్వర్గము రాఁదగినది. ఇంకను గింజుకొనెద వెందులకు?

నారా—ఏమి పేలుచున్నావు ? (తిరిగితన్నును.)

వేశ్య—నీయమ్మకడుపుగాల ! నీపెండ్లాము త్రాడుదెగ ! (ఏడ్చును.)

నారా—నీవు నన్నుఁ దన్నినప్పుడు నే నూరకుందు ననుకొంటివా ?

చంద్రి—(ప్రవేశించి) దిక్కుమాలినకొంప ఒక్కటేగోల ! రవంత సేపు నడుము వాల్పు నన్న నవకాశము లేదుకదా ! ఏమి నారాయణా ! ఎందులకు మాయమ్మతోఁ బోట్లాడుచుంటివి ? అది తన్నిన దని చాసిపై నేరమా ? పెద్దది—అందులో నత్తగారు—తన్నఁ గూడదా ? నీకు బుద్ధివచ్చుటకే తన్నినదా—నీపైఁ బగచేతఁ దన్నినదా ? నిన్నఁ జెడఁద్రాగి, దానినిఁ గొట్టి, తలుపుతీసి పాఱిపోయితివే—అదృష్టవశమున దొంగలు పడలేదు కాని, మాచేతికి ముష్టిచిప్ప రాఁదగినపని చేసితివి గాదా ! ఇట్టినిన్నుఁ దన్నినఁ దిప్పు లేదు లే—అదిగాక, పరిహాసమునఁ దన్నినను దన్నవచ్చును. నీవు నిన్నరాత్రి చేసిన పనికి నీ మొగ మింకఁ జూడఁగూడదని నిశ్చయపఱచుకొంటిని. రాత్రి నీకొఱ కెంత బాధపడితినో నీవెఱుఁగుదువా ? నీపై మమకారము నన్నిన్ని విధములఁ గటకటఁ బెట్టుచున్నది.

నారా—నీవి ట్లుపేక్షించిన యెడల నది నన్ను మఱింత తన్నదా ?

వేశ్య—నాకాలినొప్పి నను జూచుకొన నవసరమా నాకుఁ జోటు ?

చంద్ర—మాటమీఁద మాట—నారాయణా ! నీ విటురా—చీట్లపేక యాడుకొందము. (లోపలికి నడచుచుందురు.)

వేశ్య—మొండిముండకొడుకు కొంతతిన్నఁ దన్నినాఁడో—రవంత సేపు నడుము వాల్చినఁగాని బాధతీఱదు.

(మంచముపైఁ బండుకొనును.)

(నేపథ్యమున తలుపుగ్రుద్దులు వినఁబడును.) ఎవరులోపల-తలుపు-తలుపు.

**వేశ్య**—(లేచి) ఒక్కటే గోల—ఎవరక్కడ? గొంతుఁ జింపుకొని చచ్చినసరే—నేను లేవను.

(ఆసందడి విని చంద్రరేఖ, నారాయణరావు రంగమునకు వత్తురు.)

**నారా**—నా కొఱకెవ్వరైన వచ్చినా రేమో చూచెదను.

(తలుపు తీయును.) (లక్ష్మి ప్రవేశించును.)

**నారా**—ఆ! నీవా? అంత కేకలు వేసితి వెందులకు? మాయమ్మ యేమైనది?

**లక్ష్మి**—క్షమింపుఁడు—వినఁబడ లేదు కదా యని వేయవలసివచ్చినది. మీయమ్మ నేను వచ్చునికి బ్రదికియున్నది.

**చంద్ర**—నాకొంప యల్లరిచిల్లరకొంప యనుకొంటివా? ధర్మసత్రమనుకొంటివా? నేను గడనెక్కి యూడు దొమ్మరిసాని నను కొంటివా? వేళ పాళ లేకుండ నాతలుపు గొట్టెదవా? తలుపుతీసి నీ కాతిథ్యమిచ్చుటకు నీవు పోషించుచున్న బానిస లిక్కడ నెవ్వరైన నున్నా రనుకొంటివా? నీకు నాపై నంత స్వాతంత్ర్య మెవఁ డిచ్చినాఁడు? నాకింత రాత్రివేళ నిద్రాభంగమును గలుగఁ జేయుటకు నీ వెందులకు సాహసించితివి?

**లక్ష్మి**—అమ్మా! క్షమింపుము. నేను మహాపదలో నుండుటచే నిన్ని యోజింప లేకపోయితిని.

**చంద్ర**—నీవు మహాపదలో నుండునెడల నీపాటు లేవో నీవు చూచుకొనవలసినది. నీయేడ్పు లేవో నీ వేడువవలసినది. కాని నీమూలమున నాకు బాధ యెందులకు?

**లక్ష్మి**—నాధర్మ యిటనుండుటచేత రావలసివచ్చినది.

నారా—నిన్ను నే రమ్మంటినా ? దాసిని బాపు మని చెప్పితినిగాదా?
లక్ష్మి—దాసిని బాపునెడల మీరు రారేమో యని వచ్చితిని.
చంద్ర—నీవు వచ్చినంతమాత్రమున నీతఁడు నీవెంట వచ్చు నని యనుకొంటివికాఁబోలు—ఏది? అతఁ డేమాత్రము వచ్చునో నీ వే మాత్రము తీసికొనిపోవుదువో చూతము. నాయింటిలోనున్న వానిపై నా కామాత్రము స్వాతంత్ర్యము లేదనుకొంటివా?
నారా—వచ్చుటమాటయో రాకపోవుటమాటయో చూచుకొనవచ్చును గాని, యాఁడుదానవు, సంసారిణివి; అర్ధరాత్రిమున నొక్కతెవు రావచ్చునా ?
చంద్ర—సంసారిణికాదా ? మహాపతివ్రతకాదా ? అందుచేత నర్ధరాత్రమునఁ విలాసార్థముగఁ దిరువీథులు వేంచేసినది. పడుచుకొనుటయే వృత్తిగాఁగల మేముసైతము నింతసాహసించి, యింత తెగించి, యింతపురుషలక్ష్యము లేకుండ, నింత మొండితనముతో, నింతరాత్రి వీధిగుమ్మము దాఁటుదుమా ? మమ్మ మించిపోయితివా మాతల్లీ ! అట్టినీవు నీమగని కరుంధతివి. ఏమి చెప్పను. ప్రపంచధోరణి యీలాగుననున్నది.
లక్ష్మి—రామరామా రామరామా (చెవులుమూసికొనును.)
నారా—ఓసినిర్భాగ్యురాలా ! వింటివా చెప్పుదీసికొని నిన్ను నన్ను నామె యెట్లు కొట్టుచున్నదో ? నీవు నాగౌరవమున కెంతభంగము కలుగఁజేసితివి ! నల్వురిలోఁ దలయెత్తి తిరుగుచున్న నా కింత తలవంపులు తెచ్చితివి. ఆఁడుదాని కింతస్వాతంత్ర్యమా ? ఇంత స్వేచ్ఛావిహారణమా ?
లక్ష్మి—నాథా ! ఇట్లు వచ్చుట యందింత తప్పున్న దని నాకుఁ దెలియక వచ్చితిని. క్షమింపుము.

నారా—సరే, మాయమ్మదేహస్థితి యెట్లున్నదో స్పష్టముగాఁ జెప్పు.

లక్ష్మి—మీ రీవలికి వచ్చునెడలఁ జెప్పెదను.

నారా—(చంద్రరేఖవంకఁ జూచుచున్నాఁడు.)

చంద్రి—నీవు నావంకఁ జూచు టెందులకు? నిన్నుఁ బొమ్మని నే నందునా—పోవల దందునా? నీ యిష్టమువచ్చినట్లు చేసికోవచ్చును. వీథిగుమ్మము దాఁటి నాలుగడుగు లావలఁ బెట్టి నెడల నీకే తెలియును. కూడవచ్చిన యేమిండగాని చేతనో నీతలప గులఁ గొట్టించును. నీశరీరమును మాయింటఁ బడవేయించును. నేను నిన్నుఁ జంపినా నని లోకమున వెల్లడిచేయును. నన్ను రితీయించును. తాను పైయూర ధర్మసత్రము వేసి లోకోపకార మొనర్చును.

లక్ష్మి—రామరామా—రామరామా—రామరామా (చెవులుమూసికొనుచు.)

చంద్రి—అబ్బ! అబ్బ! రామభక్తురాలు—సర్వసంగపరిత్యాగిని యైన యోగిని.

నారా—నీవు యోగ్యురాలవే యనుకో. నిన్నుఁ గూర్చి జనులు పలువిధముల శంకింపవలసిన దురవస్థలోఁ జిక్కుకొంటివేల? నేను వెలుపలికి రాను. చెప్పవలసిన దేదో యిక్కడనే చెప్పుము.

చంద్ర—"యోగ్యురాలవే యనుకో" యని యీసన్నాయినొక్కు లెందులకు? యోగ్యురా లని నాకు విశ్వాసము లే దని నీవు చెప్పుటకా? యోగ్యతయఁట. ఏమి యాయోగ్యత! ఎక్కడనున్న దాయోగ్యత! సంసారములో నున్న దెంత పితృశరీరిణి యయ్యును యోగ్యురాలు. సాని దెంత కట్టుదిట్టమైన దైనసరే యయోగ్యురాలు. ఇంతే ప్రజలయూహము. సంసారిశబ్దము

యం దౌర్భాగ్యతయున్నది. సానిశబ్దములో నదౌర్భాగ్యతయున్నది. అంతేకాని మనుష్యులలో లేదు. సంసారిణులు, సానులు తల్లి కడుపున నొక్కలాగే పుట్టుదురు. వారికిఁ దత్త్వములలో భేద మెంతమాత్రము లేదు. సానిదానిని తుచ్ఛశాఖాలంపటురాలి గను, సంసారిణిని వైరాగ్యసంపన్నగను భగవంతుఁడు పుట్టుక లోనే చేసియుండలేదు. మాకంటె మితిమీఱినవారు సంసారిణులలో నెందఱో యున్నారు. సంసారిణులకంటెఁ బతిభక్తలైనవారు మాలో నెందఱో యున్నారు. సంసారిణి యైనయెడల నాహాహా! యని చేతులుజోడించుకొని దూరముగఁ బోవుటయును, సానియైనయెడల హెహెహె తుచ్ఛురాలని కనుగీఁటి, మీఁదికి రాఁబోవుటయును ప్రతిజనునికిఁ బెద్దపోఁగాలమై యున్నది. ఇట్టివారిని బారగట్టలకుఁ గట్టి యుత్తరదక్షిణాలక్రింద మోఁదవలసియున్నది.

నారా—చంద్రరేఖా! నన్ను క్షమింపుము. నిన్ను నేనేమియు ననలేను.

చంద్ర—నన్నన్నవారిని జోడుతీసికొని తన్నెదను.

నారా—(అప) ప్రాణప్రియా! నాభార్యయెదుటమాత్రము నన్నుఁ దిట్టకుము. నీచేతఁ దిట్లుతిట్టించుకొనుట నాకు గౌరవలోపమని కాదుసుమా! అట్లుమాత్రము మనుకొనకుము. మనకు మనకు నత్యంతమైన మమకారము కావున మన కట్టిభేదము లేదు కాని యిట్టిప్రేమతత్త్వప్రాబల్యము నాభార్య యెఱుఁగని దగుటచేత నీతిట్లేమో దానికి విపరీతములుగాఁ గనఁబడును. పైకిఁ జెట్టెంతపోయినదో, లోపల వేరంతలోఁతునకుఁ బోయినట్లు, నీతిట్లెంతవిశేషముగ విజృంభించునో మన కన్యోన్యప్రేమ మంత యగాధమని నాభార్యకుఁ దెలియదు. పాప

రత్వము చేతను దెలియకపోవచ్చును, పణ్యవీథిపరిపాటి కలవాటు పడినవి కాకపోవుట చేతఁ దెలియకపోవచ్చును.

చ౧—మా న్యాయమైనచర్యయే ప్రపంచమున కన్యాయముగాఁ గన్పట్టుచున్నది. భార్య లవిటిచేతిస్త్రీకాలియడుసుకంటిదయ్యా పుమొగపుముండ లగుటచేతనో, పై వెలుపలిధాటిగలవా రగుటచేతనో, దీర్ఘరోగభూయిష్ఠ లగుటచేతనో, వీథినిఁ బడవలసి వచ్చిన నిర్భాగ్యులగు పురుషుల నాదరించి, యక్కఱదీర్చినందుకు మా కీపురుషుల తల్లిదండ్రులచేఁ దిట్లు, సోదరులచేఁ దిట్లు, భార్యలచేఁ దిట్లు— అంతటితో నైనదా? ప్రజలందఱి చేతఁ దిట్లు— వారిసంసారముల పైచికొంటిమనియు, వారియిల్లు గూల్చితి మనియు, వారిమర్యాదలు మంటఁ గలిపితి మనియు, వారిసొంప దోఁచుకొంటి మనియు, వారియుగతికి భంగముకావించితిమనియు మమ్ము మోసకత్తెలుగ, నసత్యవాదినులుగ, బంగపోటుదొంగలుగ, రాక్షసులుగ, ప్రాణాపహారిణులుగఁ బరిగణించుచున్నారు. మేము ధనము పుచ్చుకొందుమఁట— చేసిన సేవకు ధనము పుచ్చుకొనని వారు లోకమున నున్నారా? ఈధనము కొఱకే కాదా ప్రజల కన్యోన్యసంబంధములు. తండ్రికిఁ గొడునకు సంబంధము—అన్నకుఁ దమ్మునికి సంబంధము—ఆలికి మగనికి సంబంధము—గురునికి శిష్యునకు సంబంధము—రాజునకుఁ బ్రజకు సంబంధము— ఇట్టికోటిసంబంధములకు ధనమే మూలముకాదా? అన్నిసంబంధములు ధనసంబంధములే యైనను, నొక్కవిటవేశ్యాసంబంధముమాత్రమే ధనసంబంధమఁట! మాకు వెలవెలఁదులని, ధనకాంత లని పేళ్లుకాదా? వంటపూటింటిదానికి ధనకాంత యనుపే రున్నదా? లేదు.

మగుడవోష్టు శుద్ధిచేయుదానికి వెలవెలఁది యని పేరున్నదా? వీరికంటె మే మధమల మనియేకాదా ప్రజలయభిప్రాయము. మాకొక్కధనమే ప్రధాన మనియు, దయాదాక్షిణ్యములు, మనుష్యత్వముకూడ మాకు లేవనియుఁ బ్రజలయభిప్రాయము. ఇంతబుద్ధిలేనిప్రజ లుండుటకంటె భస్మమగుట మంచిది.

నారా—చంద్రరేఖా! ఈరాత్రి ప్రపంచవైఖరినిగూర్చి శారదాదేవి వలె నుపన్యాస మారంభించితి వే! మహాత్మురాలవు! ఏధో రణిలోఁ బడినపు డాధోరణిలోనే పోవుఁగు తేఁగల బుద్ధిమంతు రాలవు.

చంద్ర—ఇదిగో— ఈమహాపతివ్రత, నాపుణ్యమున, నాయిలు పవిత్ర మొనర్చుటకు వచ్చినది కావున నింతదూరము చెప్పవలసివచ్చి నది. ఓనాథతిలకమా! నీకొంటతనము లేకపోవుటచేతనో, మగతన ముండుటచేతనో, నీభర్త మాయిల్లుపట్టినాఁడు. నేను నాల్గుమాసములవఱకుఁ గుక్కను గొట్టినట్లు కొట్టివైచితినో లేదో— యర్థములేని చూపులతో నున్న నీమగనినే యడుగుము. నాప్రమాణముగా నే నతని నాకర్షింపలేను. ఈతని వలన నే నేమియు బాగుపడలేను. అనేకవిధములఁ జెడిపో యితిని. నేను బరమపాపాత్మురాల నని, కిరాతురాల నని, నన్ను నీ వేమో తిట్టుచున్నావఁట. నాయథార్థతత్త్వ మేదో నీకుఁ జెప్పుచున్నాను. నాయోగ్యతయుందు నీదౌ యోగ్యత కాదు. ఇంతటినుండియైన నుడలు తెలిసికొని మాటలాడుట మంచిదని బుద్ధిచెప్పుచున్నాను.

లక్ష్మి—నిన్ను నే నెప్పు డేమియు ననలేదు.

చంద్ర—నీవో నీయత్తయో—ఎవ తైయైన నేమి?

నారా—చంద్రరేఖా! దయ యుంపుము. ఈమెవచ్చినసంగతి యేదో కనుఁగొందము.

చంద్రి—కానీ—నేను వలదంటినా? పేకయాట యంతయుఁ జెడిపో యినది.

నారా—లక్ష్మీ! నీవు వచ్చినపని యేదియో త్వరగఁ జెప్పు.

లక్ష్మి—మాయత్తకు గుండె లెక్కువగాఁ గొట్టుకొనుచున్నవఁట-గుండె యాగిపోవు నని వైద్యుఁడు చెప్పినాఁడు—నేను వచ్చుసరి కామెకు స్మృతి లేదు. నేలపైఁ బండుకొనియున్నది.

నారా—అంతవఱకు వచ్చినదా?

లక్ష్మి—ఆ.

నారా—ఇట్టిస్థితిలో నేను వచ్చి చేయవలసినదేమున్నది? మాటయా—చూపా యే మున్నది? నాడి వట్టి బేలగుండె. అందులోఁ దల్లి గాని మఱియొకరు మఱియొకరా? నేను రాలేను. మాయమ్మ కిక్కడనుండియే నమస్కార మర్పించుచున్నాను. తూర్పు తెల్లవాఱుటతోడనే వచ్చెదను.

చంద్రి—ఉదయమున సౌమధమునకుఁ బోయి మాయమ్మకాలినొప్పికి మందుదెచ్చెద నంటివి కాదా? తెల్లవాఱుజామున నింటికిఁబో వుట కవకాశ మెట్లున్నది? నీవు మందు తేకున్నయెడల నెవ్వరు తెత్తురు? నీవు జీతమిచ్చి పోషించుచున్న భృత్యు లెవ్వరైన నిచ్చట నున్నారా?

నారా—ఇంటికిఁ బోయి చూచినతరువాత నైనఁ దెచ్చిపెట్టఁగలను. అది యెంతపని?

లక్ష్మి—నాథా! మీరు రా ననుచున్నారా?

నా—ఉపయోగము లేనప్పుడేల శ్రమపడవలెను? నిన్నరాత్రి నిద్ర

లేదు. ఈరాత్రి నీమూలమున నిద్ర లేదుకదా! నాశరీరము మంచిదికా దని యెఱుఁగనే యెఱుఁగుదువు. నేను మంచమునఁ బడినయెడల నీగతి యేమి?

చంద్రి—'నీగతి యేమని' భార్య నంటివికాని యీమాత్రముమాట నన్నుఁగూడ ననుటకు నీకు నోరు రాకపోయెనా? తొత్తునై నీ కెంతకాల మూడిగముఁ జేసినను నీ కభిమానము లేక పోయినదే! మూఁడేండ్లనుండి నీకు భార్యనై సమస్తవిధముల నిన్నుఁ గొల్చుచుంటినే-నే నామాత్రపుమాట నోఁచుకొనుటకుఁ దగనా? చేతియీవి లేకపోయినను నోటిమాట కేమి? ఏదైన వ్యత్యాసము కల్గునెడల నీభార్యవలెఁ దలఁదీయించుకొని, ముసుఁగువైచికొనను గాని బ్రహ్మచర్యదీక్ష నవలంబింపనా! ఆ! నారాయణార్పితమగు నాశరీరము వైశ్వానరార్పణము కావలసినదే కాని—

నారా—నీ వెంతయోగ్యురాలవో నే నెఱుఁగుదును; కాని నాభార్య యెఱుఁగదుకాదా?

లక్ష్మి—నాథా! తల్లిగారిని మీ రీసమయమున వదలి యుండఁగూడదు. అది యిక్కడకుఁ దగదు. అక్కడకుఁ దగదు.

నారా—లక్ష్మీ! ఏది తగునో యేది తగదో నాకుఁ దెలియ దనుకొంటివా? ఇందునుగూర్చి నీవు నాకు వేరే చెప్పనక్కఱలేదు. నీవు త్వరగాఁ బోవుట మంచిదికాదా మఱి?

లక్ష్మి—మీతోడపైఁ దనశిర ముంచి ప్రాణము విడచినఁగాని యామె యాత్మకు శాంతి కలుగదు. దయయుంచి రమ్ము.

నారా—ఇది యొక వెఱ్ఱి యూహాము. ఆమె [illegible]. ఆమె యుత్తమత్వమువలని సుగతి యామెకు లభించును. నే నిక్కడ

నుంటిని గాన నీ వట్లు కోరితివి. నేను మఱెక్కడ నైన నుండు నెడల నామె కుత్తరగతు లూడిపోపలసినదేనా ? ప్రపంచధర్మమునుబట్టి చూచినను బరమార్థమునుంబట్టి చూచినను నే నామెయొద్ద నుండుట యనావశ్యకముగాఁ గనంబడుచున్నది. అనవసరములైన కార్యములందుఁ బ్రవేశించుట బుద్ధిమంతులకుఁ దగదు.

లక్ష్మి—ఇంతకంటె నవసరము మఱెప్పుడు కలుగును ? ఆమె తిరుగ మీకంటఁ బడునా ? ఆమెను గడపటిసారి చూచుటకైన రండు.

—ఉదయములోపల నేతొందరయు నుండదు. తొందరకలుగు నదియే యనుకో. తెల్లవారినపిమ్మట రానా చూడనా ? ఈ నా తిక్కృత్యము లన్నియు జరిగింపనా ? లక్ష్మీ ! నీ విట్లనవసరముగ నెప్పుడు ప్రత్యుత్తరములు చెప్పినదానవు కావు. నడు. ఇంటికిఁ ద్వరగ నడు.

లక్ష్మి—నాకు బహుమనస్తాపముగా నున్నది. ఆమె నింతదిక్కుమాలినదానింగాఁ జేయుట ధర్మము కాదు. ప్రజలు నిందింతురు. భగవంతుఁడు శిక్షించును.

నారా—చీ ! చీ ! తలకుఁ దగనిప్రలాపములా ? నోరుమూసికొని పొమ్ము.

చంద్ర—సాధ్వీమణికాదా ? మగనిలక్ష్య ముండునా ? ఇంతపెంకిపట్టు గలదాని, నింత మొండిదానిని, మగని నెదిరించి ఝూంకరించిన యింతలజ్జాశూన్యురాలినిఁ జంద్రమతీదేవి, సీతాదేవి యంటివే ! నీవు నా మెడలోఁ దాళిగట్టితివా? నాతో సప్తపాదములు త్రొక్కితివా? అగ్నిసన్నిధిని మనము ప్రమాణములొనర్చుకొంటిమా? అట్టినేను, నీమాటకెన్నడైన జవదాంటితినా? నీవన్నది యాజ్ఞ

యని శిరమున ధరించితినే. నీవు పెట్టినది భిక్ష మని చేయి చాఁపితినే- నే నిక్కడనుంటిని-మాయమ్మ యానులకకుక్కపైఁ గూలఁబడి యీచిత్రమును జూచుచు ముక్కుపై వ్రేలువైచి కొని తెల్లఁబోయి కూరుచుండినది_గాడిదెయంత మగఁడవు నీ వెనుకగ నుండి 'హో హో' యని మొండ్రపెట్టుచుంటివి_ నలుసంత టొంకిన దేమో చూడు-తెప్పవ్రాల్చిన దేమో చూడు-ఆఁడుది యనఁగా నిది. ఇట్టివారే దండుదండు నతిత సంతుష్టిపఱుపఁగల నేఱజాణలు.

లక్ష్మి—రామరామరామా—రామరామరామా.

(చెవులు మూసికొనును.)

చంద్ర—ఇందులో నిది యొక్క విశేషము! దూకినగోడలు దూకుచునే యుండవలయును-చేసిన రామస్మరణలు చేయుచునే యుండవలయును—కోసినగొంతులు కోయుచునే యుండవలయును చేసినరామస్మరణలు చేయుచునేయుండవలయును. మనుజులలో నిది యొక్క సంకరజాతి. దొంగ కాఁడు భక్తుఁడు కాఁడు. అదియు నిదియుఁ గూడిన కంచరగాడిదెజాతి.

నా—తుచ్ఛురాలా! ఇంకను బోవేమి? ఇంకను బోవేమి?

(చేయియెత్తి మీఁదికిఁ బోవును.)

చంద్ర—ఓరి నపుంసకుఁడా! క్రియలేని పలుగుమాట లేల? పంచపాళిలో మాయమ్మ కఱ్ఱతెచ్చి పొడువక క్రోఁతిలాగున నగురులాడెద వేల?

వే—ఇదిగో. నాయొద్దనే యున్నది. తీసికొనుము.

లక్ష్మి—(పోఁబోవును.)

నారా—(కత్తి తెచ్చి లక్ష్మిన్న ప్రక్క టెముకలలోఁ బొడుచును.) పోవా! నీముండమోయ! పోవా!

లక్ష్మి న్న—రామరామా. (క్రిందఁ బడిపోవును.)

నా—(తెల్లఁబోయి చూచును.)

చంద్రి—ఆమాత్రపుఁబోటునకుఁ గ్రిందపడినవా రెవ్వరు నుండరు. ఈమె తాగినవచ్చులచేత నిట్లు తూలిపోయినది.

లక్ష్మి న్న—(లేచి) రామరామరామా (పోవుచు) నాథా! నమస్కారము. (పోవును.)

చంద్రి—పనికిమాలిన గొడవతోఁ గాలము వృథమైనది. నారా యణా! పేకయాడుకొందము రా!

నా—ఇప్పు డేమియు వలదు.

చంద్ర—భార్యను గొట్టినందుల కేడ్చుచున్నావా?

నా—నాకుఁ దలనొచ్చుచున్నది. పండుకొందును.

చంద్ర—సరే—నీ కర్మము. (నిష్క్రమించును.)

నా—వెళ్ళుచున్నప్పుడు నాకు నమస్కరించుచు నాపై నొక్కచూపు చూచినది. అట్టిచూపుమాత్రము నే నెక్కడను జూడలేదు. అది యేమో వింతగా నున్నది. ఆచూపుతో నామనస్సు చేయిపెట్టి కలిపిన ట్లయినది. ఆచూపులో దైన్య మున్నది—ధైర్యమున్నది. దయ యున్నది—రవంత కాఠిన్య మున్నది. అన్నిటిని మించిన దేదో యలౌకిక తేజ మున్నది. నా కిప్పుడే పోవలయు నని యున్నది కాని యీముండ పోనీయదు. తెల్లవారు చుండగఁ బోవుదును. (నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.

---

శ్రీరామా !

# రాత్రిస్తంభము.

## పంచమాంకము.

ప్రదేశము—నారాయణరావుగారిల్లు ;

ప్రవేశము—లక్ష్మి, నారాయణరావు.

నారా—దుర్భాగ్యుఁడనై కిరాతుఁడనై నిన్నుఁ గత్తితోఁ బ్రక్కటెముకలలోఁ బొడిచినప్పుడు నీవు నావంకఁ జూచిన చూపున్నదే! అది నామనస్సులో నేదియో మార్పుఁ గలుగఁజేసినది. మనస్సునకుఁ బుట్టిన వెఱ్ఱివెఱ్ఱితలల నట్టె ఛేదించిన ట్లయినది. హృదయములోనున్న మాలిన్యమునకు నిప్పంటించిన ట్లయినది. ఎఱ్ఱిమట్టితో నున్నసీటికుండలోఁ జిల్లగింజవైచి చేతితో నీరు గిరగిర త్రిప్పిన ట్లయినది. ఎఱ్ఱగఁ గ్రాఁగినలోహము మూసలోనున్నప్పుడు కమసాలిగొట్టముతో నుష్హాని లోనున్న కశ్మలత్వ మెగురఁగొట్టిన ట్లయినది. నాయనుభవ మనేకవిధములుగా నున్నది. ఆచూపు నాచిత్తమును గట్టిగ నూచి దులిపినట్లొకప్పుడుండెను. రెండుచేతులనడుమఁబెట్టి గట్టిగ నలిపి రసముపిండిన ట్లొకప్పుడుండెను. మనస్సులోనుండి యేదో యావలికిఁ గొంతపోయిన ట్లున్నను మనస్సు నీరసముగా లేక బలముగా నున్న

ట్లున్నది. ఇదేమో నాకు వింతగా నున్నది.

లక్ష్మి—నాథా! నే నొక్కముఖ్యమైనమాట చెప్పుట మఱచినాను.

నార—నీమాటకంటె నేను జెప్పఁబోవుమాట ముఖ్యము కావున నది వినుము. నాకుఁ బిశాచావేశ మగుటచేత నిన్నుఁ బొడిచితినో నా కున్మాదావస్థ సిద్ధించుటచేఁ బొడిచితినో నాకుఁ దెలియదు. ఎటులైననేమి పొడిచితిని. యమధర్మరాజు నాచేతుల నటుత రువాత ఖండించుఁగాక! రోటిలోఁ బెట్టి దంపించుఁగాక! ఇనుప గానుగలోఁ బెట్టి యాడించుఁగాక! ఆశిక్ష యేదియైన సరి యే నేను బరిగణింపను గాని నీవు న న్నుపేక్షించితివి! ఇదిగో నిన్నుఁ బొడిచినకత్తి- దీనిని జాగ్రత్తపెట్టి యుంచితిని. ఎందు లకో తెలిసినదా? నేను జచ్చిన పిమ్మట దీనిని నాచితిపైఁబెట్టి కాల్పింపవలయును. దీనితో నీవు నాతలఁ బగులఁగొట్టుము. అంతవఱకుఁ జేయలేవా; నాడొక్కలోఁ బొడువుము. నీవు నన్నుఁ గొట్టినఁగాని నామనస్సు శాంతిపడదు. నీ వుపేక్షించి నకొలఁది, నీవు నన్నుఁ గొట్ట కూరకుండినకొలఁది, నిన్నుఁ గొ ట్టితి నన్నబాధ నాకు క్షణక్షణము వృద్ధి యగుచున్నది. కొట్ట వా! కొట్టవా! పోనీ—గట్టిగనైనఁ దిట్టుము. అదియైనఁ జేయ వా? నీవు శాంతించినకొలఁది నాహృదయతాప మెక్కువగు చున్నది. శిక్షకు శిక్ష భగవంతుఁ డేర్పఱచినాఁడు. నిన్ను నేను గొట్టినప్పుడు నీవు "నాథా! నమస్కారమ"ని యనుట చేత నాగుండెలలో నిప్పు పుట్టినది. నీవట్లనక ఛీ యని గట్టిగా ననినఁగాని, ఛూ యని నిరసించి నాముగముపై నుమిసినఁగా ని నే నింత వ్రణబాధ పడియుండను. కావున నాకు శిక్షచేసి రక్షింపుము.

లక్ష్మి—నాథా! తొందరపాటు శాంతివలనఁగాని నశింపదు. శిక్ష కోపథము బహుమానము కాని శిక్ష కాదు. నీవు నన్నుఁ గొట్టినప్పుడు నిన్ను నేను దిట్టినయెడల నీమనస్సు మంచిమార్గములోనికి రాదు. "నే నిచ్చినదెబ్బకుఁ బ్రతిక్రియ జరుగుటచేత నిఁక నాఋణము తీఱిపోయినది కదా!" యని నీవు స్వతంత్రింతువు. నిరంకుశముగ నుందువు. ఇఁకొకసారి కోపమున నీవు నన్నుఁ గొట్టుటకుఁ బ్రయత్నింతువు. మఱింతగట్టిగఁ గొట్టినయెడల మఱినాల్గుతిట్లు నావలన నీకుఁ గలుగును. కాని యంతకంటె మఱేమియుఁ బ్రమాదము లేదని నీవు ధైర్యముతో నుందువు. నీశిక్షకు నేను బ్రతిక్రియ చేయక యుండునెడల నీవు నన్నుఁ గొట్టుట యెన్నఁడును తలస్థింపదు. వెనుకఁగొట్టినదెబ్బయే ప్రతిక్రియారాహిత్యముచేత నిన్ను బాధించుచుండ నీవు నన్నెన్నఁడు బాధింపవు. ఇది నీమాటకు నామాటకుఁ జెప్పిన మాట కాదు. లోకవ్యవహారధోరణి యిట్లున్నదని చెప్పుచున్నాను. అపకారమునకుఁ బ్రత్యపకారశూన్యతయే పునరపకారవాంఛను దొలఁగించుచుండ నపకారమున కుపకారమే చేసినయెడల నిఁకఁ జెప్పవలసిన దేమున్నది? ఈమాటల కేమి? నేను జెప్పఁబోవుమాట వినుము. మాయమ్మగారు పదినిముసముల కింకఁ బరమపదింతు రనఁగా నామెకు స్మృతి వచ్చినది.

నార—మాయమ్మగారి యవసానదురవస్థను నాకు జ్ఞప్తిచేయకుము. నేను వినను. నామనస్సునుండి యది తుడిచిపెట్టకతప్పదు. ఆమెమరణకాలమహాదురవస్థను మఱచిపోవుటకు నేనేమి చేయఁగలను? మెదడులో జ్ఞప్తిస్థలమైన నరములకూడికను దీసివేయఁగల వైద్యుఁ డెవఁడు? అది యెట్లు సాధ్యమో నీకుఁ

తెలియునా? నల్లమందు మ్రింగనా? నల్లయుమ్మెత్తగింజలసార మును త్రాగుదునా? స్మృతిపోవు వనాంతరము నీవేదైన నెఱుగుదునా? అవున కాముడపాకువలెఁ, గాకికి గ్రిచ్చపప్పువలె, నాకు విస్మృతిఁ గలిగించు నోషధిని జెప్పువారిపాదములకు సాష్టాంగ మొనర్తును.

లక్ష్మి—నాథా! ఉన్నప్పుడు తల్లిగారిమాట మఱచిపోయి యామె లేనప్పుడుకూడ నామెమాట మఱచిపోవునప్పుడు తల్లిఋణము తీరునట్లు? ఆమె ననుదినము స్మరింపుము. ఆమెకు మనస్సులో నమస్కరించుకొనుచుండుము. అంతకంటె నీ వామెకుఁ జేయఁదగిన దేమున్నది? దొడ్డిలోఁ బెద్దనుబ్బరోటిక్రింద నని మిదివందలరూపాయలమూట యున్నది. దానిని దీసికొను మని చెప్పినది. ఆసొమ్ము నీది కావున నీవే తీసికొనుము. రామా రామా! తిరిగి డొక్కలోఁ బోటారంభమైనది. ఈసారి మఱింత గట్టిగా వచ్చినది.

నాథా—ఇదివఱకు పోటని చెప్పలేదే?

లక్ష్మి—తెరతెరలుగా రాత్రినుండి వచ్చుచునే యున్నది. సహింపఁ గలిగినంతవఱకు మీతోఁ జెప్పలేదు. రామరామరామారామ:

(గిజగిజ కొట్టుకొనును)

నాథా—అయ్యయ్యో! కాచనా? వైద్యునిఁ దీసికొనివత్తునా? అచ్చి! నీవిటురా—నిప్పుచేసి నీవు కాచుచుండుము నేను బోయి వైద్యునిఁ దెత్తును.

లక్ష్మి—తొందరపడవలదు. తగ్గుచున్నది. వైద్యుఁ డెందులకు? భవరోగముల కన్నిటికి రామనామమే మహౌషధము కాదా?

రామనామమును నేను స్మరించుకొందును నీవుకూడ స్మరించు
కొనుము.

నారా—అయ్యయ్యో ! రామనామమును దలఁపనివాఁడను నేనొక్కఁ
డనే యీభారతదేశమం దున్నాను. ఇదిగో ! లెంపలుకొట్టు
కొనుచున్నాను. నేను రామనామము నింకఁ బాడుకొందును.
రవంత చెప్పుదువా ?

లక్ష్మి—నాథా ! నాకుఁగూడఁ బాడెదవా ?

నారా—నీకు డొక్కలోఁ బోటుగా నున్నప్పుడెట్లు పాడఁగలవు ?

లక్ష్మి—తెరవచ్చినప్పుడే బాధకాని లేనప్పు డింటిపనులు చేసికొను
చుండుట లేదా.

పాట.

జయజయ రాఘవ జానకిరామ్—రఘుకులరాఘవ రాజారామ్
రావణసంహార రాఘవరామ్—రఘుకులదీపక రాజారామ్
నీరధిబంధన రాఘవరామ్—మారుతిసేవిత రాజారామ్
దశరథనందన రాఘవరామ్—దానవభంజన రాజారామ్
మునిసవనావన రాఘవరామ్—పురహరపూజిత రాజారామ్
మంగళగుణగణ రాఘవరామ్—మంజులభాషణ రాజారామ్
పతితపావన రాఘవరామ్—భక్తినొసఁగుమా రాజారామ్
జానకిరంజన రాఘవరామ్—జన్మవిభంజన రాజారామ్ ॥ జయ ॥

రవంత నిద్రవచ్చుచున్నది. పండుకొననా ?

నా—పండుకొనుము. అభ్యంతరమేమి? నేను మఱియొక్క రామకీర్తనఁ
బాడుకొందును. నీరామకీర్తనలపుస్తక మేది ?

లక్ష్మి—నాతలక్రింద నున్నది. తీసికొనుము.

బిలహరి-ఏక.

నా— జయరామ ! జయరామ ! జయజానకీరామ !
జయసర్వగుణధామ ! జయసార్వభౌమ !
జయశుభాకరనామ ! జయవైరిభీమ ! ॥ జయ ॥
ఇక్కడన కక్కడన కెక్కడను గాంచినను
అక్కజంబుగ నుండు తనుచు పెద్దలుపల్క
మ్రొక్కి మ్రొక్కి కనులు పొడుచుకొని చూచినను
ఎక్కడను గానఁబడ వెక్కిరింతునయ్యా. ॥ జయ ॥

(తొట్టిలోఁ పిల్లవాఁడేడ్చుచున్నాఁడు. అచ్చి యెత్తు
కొనును. ఇంకను నేడ్చును.)

నా—నాయనా ! కృష్ణా ! అమ్మ కిప్పుడే నిద్దురపట్టినది. ఏడువకు.
అచ్చీ ! ఏడ్పుమానకుండ నున్నాఁడు. నే నెత్తుకొందును.
నా చేతి కిమ్ము.

అచ్చి—మీయొద్దకు వచ్చునా ?

నా—(పిల్లవానిని బలవంతముగఁ దీసికొనును) (పిల్లవాఁ డేడ్పుమా
నకుండును.) నాయనా ! నాయనా ! ఊరకుందుము.

(జోకొట్టును.)

అచ్చి—బాబూ ! మీ రెప్పుడైనఁ జనవుచేసికొంటిరా ?

నా—(తనలో) ప్రపంచమున నెన్నిసంసారము లున్నవి! ఎందఱో
కొడుకులఁ గనుచున్నారు. ఎవ్వఁడైన నావంటిపాపాత్ముఁ
డీప్రపంచమున నుండెనా ? మూఁడేండ్లకు మొదటిసారి బిడ్డ
నెత్తుకొన్న తండ్రి మూఁడులోకములలోఁగూడ నేను దక్క
నింకొక్కఁ డేడీ ? వీఁడు పుట్టినపిమ్మట దేశాంతరము పోయితి

ననుకొనవా ? కారాగృహమం దుంటి నని యనుకొనవా ? మొద్దులాగున నూరనుండియు, నింటికి వచ్చుచుండియుఁగూడ నెత్తుకొనకపోయితివే ! నాచేతు లేల కాల్పనా ? కృష్ణా ! తనస్వరూపముచేత నీయమ్మ నాకిచ్చిన యానందముకంటె చంద్రరేఖ యిచ్చిన యానందము ఘనమని భ్రాంతి నొందుట చేత నేను మీయమ్మ నాదరింపలేమకాని నిన్నేల యాదరింప లేదోయి తండ్రీ ! నీవు నా కొడుకవే కావా ? కొడుకు లేని వాఁడు లేఁడని యేడ్చుచుండఁగ నున్నవాఁడ ని ట్లేడ్వవలసి నదా ? నీపై ననురాగము నాకేల లేకుండవలయు ? ముండ మొరపోతనే నన్నియనురాగములు నశించినవి. వేశ్యానురాగము సంసారపరిత్యాగమునకుఁ గారణము. వైరాగ్యముకూడ సంసారపరిత్యాగమునకుఁ గారణమే. చుట్ట యలవా టున్న వాఁడు దానిని బరిత్యజించుట శ్రేయమే. కాని త్రాఁగు టల వాటుచేసికొని చుట్ట మానినవాఁడు విషయవాంఛాశూన్యుఁ డని చెప్పవచ్చునా ?

(కృష్ణుఁ డేడ్చును.)

నారా—నాయనా ! నీ కేమి కావలయును ?

కృష్ణుఁడు—నాకు మాయమ్మ కావలయును.

నారా—మాయమ్మ నీయుదయముననే ముట్టిచేసితిని. నాచేతు లామెకు నమస్కరించుట కక్కఱకు రాలేదు. ఆమెపాదము లొ[illegible] క్కఱకు రాలేదు. ఆమె కేవైనఁ బ్రియవస్తువు తెచ్చి[illegible] కక్కఱకు రాలేదు. ఆమెతలక్రింద నిప్పుపెట్టి కపాలమో చేయించుట కక్కఱకు వచ్చినవి. అంతటితో సరిపోయెనా ? మీయమ్మను పొక్కలోఁ బొడుచుట కక్కఱకు వచ్చినవి.

అస్థిపాశపు చేతులు ముకులాంగుఁడవు, నమాయకుఁడవు, దోషగంధశూన్యుఁడవు, బాలుఁడవు. భగవత్సముఁడ వైన ని న్నెత్తుకొనుట కుపయోగపడునా?

కృష్ణ—మామ్మ. మామ్మ. (ఏడ్చును.)

నారా—మామ్మ యిక్కడ లేదు తండ్రీ!

కృష్ణ—మామ్మయొద్దకు నేను బోదును.

నారా—నాయనా! అంతయపశకునపుమాటలాడితి వేమి? నీవు నా కడుపున మఱియొక చిచ్చుపెట్టెదవా? అచ్చీ! నీ వెత్తుకోవే.

(అచ్చి అట్లు చేయుచున్నది.)

లక్ష్మి—(రవంతకలతనిద్దురలో లేచి) అచ్చీ! పిల్లవానిని నాప్రక్కలోఁ బండుకొనఁబెట్టి నీవు జోకొట్టు.

నారా—నేను జోకొట్టెదను. అచ్చీ! ఎందులకైన మంచిది. కుంపటిలో నిప్పుచేసి యుంచుము.

అచ్చి—పోవును.

నారా—(పిల్లవానిని జోకొట్టుచుండును. కొంతసేపటికిఁ బిల్లవాఁడు నిద్రించును.)

(నేపథ్యమున) తలుపు. తలుపు.

నారా—(తలుపునొద్దకు వచ్చి తీసి) నీ వెందులకు వచ్చితివి?

(సోమి ప్రవేశించును.)

సోమి—చంద్రరేఖమ్మగారు మిమ్ము రమ్మన్నారు.

నారా—ఇప్పు డెందుకే?

సోమి—బాబూ! చెంపకు చేరెఁడేసికన్నులు— చిన్నకన్నులా బాబూ! సాయంకాలమువఱకు బాగుగనే యున్నవి. రవంత వేడిచేసిన ట్లున్న దని తల్లితోఁ జెప్పినది ఎప్పు డాయమ్మ కుడుకే కావా?

ఎంతసేపు తరవాణి, మజ్జిగ, పంచదార— యీలాగుననేకాదా కాలక్షేపము. సాయంకాలమందు పెసరపప్పు మామిడికాయ పులుసుతోను, కొబ్బెరకాయ పచ్చడితోను బాగుగనే భోజనము చేసినది. లేచి తాంబూలము వేసికొన్నది. "ఈరాత్రి నారాయణరావు లేకపోవుటచే నిల్లు చిన్నఁబోయిన" దని పదే పదే యనుకొన్నది. "పెద్దయామె వెళ్లిపోయినది. ఆమె కేమి ధన్యురాల" న్నది.

నారా—ఈగొడవ యంతయు నెందులకు? నిన్నామె పరామర్శకుఁ బంపించినదా యేమి?

సోమి—అబ్బే! అదికాదు బాబూ! పెద్దనీరుల్లిపాయలకుఁ బంపించినది. సంతలోనికిఁ బోయి తెచ్చితిని. సన్నముగాఁ దరిగి నేతిలో వేయింపు మన్నది. అలాగే చేసి దానిలో రవంత పంచదార వేసి యామె కిచ్చితిని. ఆమె తిన్నది. చేసినపాపము చెప్పినఁ బోవునుగాదా? నేను గొంత తింటిని.

నారా—సోమీ! ఈసోది యంతయు నెందులకు? నీవిచ్చట కెందులకు వచ్చితివి?

సోమి—నేను గూడను గొంత తిని మంచినీరు ద్రాఁగినతరువాత 'సోమీ' యని పిలిచినది. 'ఏమమ్మా' యని యంటిని. "కాళ్ళు పట్టవే" యన్నది. కాళ్ళుపట్టుచుండగాఁ బదిసార్లు—మిమ్ముఁ దలఁచుకొని కంట నీరుపెట్టుకొన్నది. అతివలకే కన్నులు కొంచెము కాకచేసి మండుచున్న వేమో యీయేప్పుతో మాటి కొంత మండినవికాఁబోలు! అప్పు డేమి చేసినదా— 'అమ్మా' యని పిలిచినది.

నారా— త్వరగఁ జెప్పుము. నాకుఁ గొంచెము నిద్రవచ్చుచున్నది.

సోమి— అంతలో నాగమ్మ కజ్జ చేతఁబుచ్చుకొని లోనికి వచ్చినది. “[illegible] ఎందుకే” యని యడిగినది. “అమ్మా! కన్నులుమండుచున్నవి. ఆనుందసమున కెడమప్రక్క నున్న గూటిలో చిన్న సీసాలో నేత్రబిందు వున్నది. ఆసీసాలోఁ జుక్కలు నాకంటిలో వేయఁగలవఁటే” యని యడిగినది. “అలాగే- అమ్మా” అని నాగి సీసా తెచ్చి రెండుచుక్క లీకంటిలో రెండుచుక్క లా కంటిలోఁ జప్పున వేసినది. అప్పటికి రెప్పలు గట్టిగ మూసికొన్న దేమో యేమియు నగలేదు. రెప్పలు రవంతవిడఁసరికే గిలగిలకొట్టుకొని యేడ్చినది. “ఏమమ్మా! ఏమమ్మా!” అని నాగి, నేను రేకమ్మను బట్టుకొంటిమి. గిజగిజ తన్నుకొన్నది. ‘మంటమంట’ యని యొక్కటే యేడ్పు. చుట్టుపట్లనున్న సుబ్బిసాని, దానితల్లి తవిటమ్మ— నీ వెఱుఁగవు గనుకనా? ఏది- ఎడమబుజముమీఁదఁ బెద్దదబ్బకాయంత కంతి యున్నమ్మ కొండలు మగవారు— పిడుకలమ్మ శివన్న, పాలాస్త్రిపట్ల పద్దయ్య, యింక నెందఱో వచ్చినారు. పెద్దతీర్థమై పోయినది. కంటిలోఁ జుక్కలువేసిన సీసా యేదో తెమ్మని మద్దెలకూటన్న యడిగి చూచినాఁడు. “అబ్బే! ఇది నేత్రబిందు సీసాకాదు, తామరమందు సీసా” యని చెప్పినాఁడు. అంతే. కన్నులురెండు నీవు నేను మాటలాడినవంతలోఁ జిల్లులుపడిపోయినవి. నాగి సానినిఁ దిట్టనివా రెవ్వరు లేరు.

నారా— నీయిల్లుబంగారము కాను. రెండుముక్కలలోఁ జెప్పవలసినసంగతి కింత యుపన్యాసము చెప్పితివే. ఇప్పుడు నేను వచ్చి చేయవలసిన దేమున్నది?

సోమి—బాబూ! [illegible] కాదా!
మీ మొ[illegible]

నారా—ఎంత ప్రాణ[illegible]
చూడఁగలను?

సోమి—నాకు—దిక్కుమాలినపూర్వపుతు[illegible] వచ్చిన
ది. ఈకన్ను లేక బాగుపడవు కాఁబోలు నేమి!

నారా—నాగి యని, నేత్రోబింబు వని, కామరసుం దని యివి యన్ని
యుఁ బైకిఁ దోఁచు పడిన వేదబములు. పతివ్రతాతిలకమైన నా
భార్యను దిట్టుటచేతనే యీశిక్ష యీశ్వరుఁడు భగవంతుఁడు చేసి
నాఁ డని చెప్పుము. నేను నాను. చప్పనఁ బో.

సోమి—బాబూ! ఏమైన నీయనా?

నారా—ఇదిగో. తీసికో (నాల్గుడబ్బు లిచ్చును)
(సోమి పోవును.)

నారా—మగనాలిని విడిచిన వేశ్యకుఁ గన్నులుపోయినప్పుడు కొట్టిననా
కంతకంటె శిక్ష భగవంతుఁడు చేయవలసినదేకదా! నాకుఁ గ
న్నులే కాదు— కాళులే కాదు—చేతులే కాదు—చెవులేకాదు—
అన్నియుఁ బోవలసినదే! పోక మానునా? నావంతు రానై
యున్నది. దానికొఱకే సంతోషముతో నిరీక్షించుచున్నాను.
లోకమున కంతకు నాశిక్ష ప్రకటింపఁబడవలయును. అప్పుడు
కాని పతివ్రతలమహిమ ప్రపంచమునకు వెల్లడికాదు. అప్పుడు
కాని వేశ్యల నుంచుకొని భార్యలను బాధించు ముండకొడుకు
లు లెంపలు వేసికొని, సంసారములోఁబడి సద్గుణులు కారు.
లోకకల్యాణమునకు దుష్టులలోఁ గొందఱు [illegible] శిక్ష
తప్పదు. నాబ్రదుకు వ్యర్థమై పోదు అని సంతోషించుచుంటిని.

ఈరీతిగా నావలన లోకము నీతినేర్చుకొన్న యెడల నేను సఫలమైన బ్రదుకు బ్రదికితినని రవంత సంతసింపఁగల్గుదును. భగవంతుఁడా! త్వరగ శిక్షింపుము. చేసినతప్పుపని యెన్నఁడు వ్యర్థమై పోదు. తాత్కాలికముగఁ గొంత పరిసిపాఱిపోయినట్లు కనఁబడినను, ద్విగుణీకృతధాటితో ఫలించునుగాని మానదు. మననోటినుండి వెలుపడిన యొక్క స్వల్పమైన తిట్టయినను తిరిగి మనపై నెప్పుడో విఱుచుకొనిపడును కాని మానదు. చేతు లున్నప్పుడు కొట్ట బుద్ధిపుట్టును. కాళు లున్నప్పుడు తన్న బుద్ధిపుట్టును. నోరున్నప్పుడు తిట్ట బుద్ధిపుట్టును. అందుచేతఁ గనులు, గాళులు, నోరుకూడఁ బడిపోవలయు నని దొందరపడు చున్నాను. అన్నిటికంటె బుద్ధిపోయి స్థాణువునైనయెడల మఱింత మంచిదేమో. అహల్య కట్టిశిక్ష యేకదా భర్తవలనఁ గలిగినది. ఆశ్రీరామచంద్రమూర్తి పాదధూళిచే నామె పవిత్రనైనట్లు నేనుగూడ నాశిక్ష ననుభవించి యారామమూర్తి కటాక్షముననే సద్గతినొందఁగలనేమో—

లక్ష్మి—రామ రామ రామా రామ రామ రామా (కేకలు పెట్టుచున్నది.)

నా—తిరిగి తెరవచ్చినదా! అయ్యయ్యో— అచ్చి! కుంపటిని దీసికొనిరా.

అచ్చి—(తీసికొనివచ్చును.)

లక్ష్మి—కాచినదాఁక వ్యవధి లేదు. మంచముక్రిందఁ బెట్టు. నానాయనను నావీపువైపునఁ బండుకొనఁజేయుము. కుడివైపుడొక్క క్రిందఁ బెట్టుము. (అచ్చి అట్లుచేయును.)

నా—ఇఁక నాలస్యము చేయఁదగను. పోయి వైద్యునిఁ బిల్తును.

లక్ష్మ్మి—రామరామా! (గిజగిజ కొట్టుకొనును.) నాథా ! వైద్యుఁడు వలదు.

నా—ఎందుచేత ?

లక్ష్మి—(అప) నాథా! నీవు కఱ్ఱతోఁ గొట్టుచుట చేత నాకడుపుపగిలిన దనియో, యందులోఁ బుండుపడిన దనియో యేదో వెఱ్ఱి మొఱ్ఱిగ వైద్యుఁడు చెప్పునెడల, నామాట నమ్మి నిన్నుఁ గారాగృహమునఁ బెట్టి యధికారులు శిక్షింతు రని నాకు భయముగా నున్నది. అందుచేత వలదు.

నా—ఓసివెఱ్ఱిదానా ! ఇందులకా భయపడుచుంటివి ? ఇందులకా విచారించుచుంటివి ? విచార మొందవలసినవారిఁగూర్చి విచారింపక పోవుట యెంతతప్పో—విచార మొందఁగూడని వారిఁగూర్చి విచారించుట యంతతప్పేసుమా. నీకు నిమ్మళముగా నున్న పిమ్మట నేనే యధికారులయొద్దకుఁ బోయి, నాతప్పొప్పుకొని, నన్ను శిక్షింపుఁ డని ప్రార్థించి నాచేతులతో—నిన్నుఁ గొట్టిన నాచేతులతో—నాకాళ్లకు సంకెలలు మహోత్సాహమునఁ దగిలించుకొందును.

లక్ష్మ్మి—నాథా ! నాకు నిమ్మళించు నను నాశ నీకున్నదా ?

నా—ఆఁ ! ఆఁ ! నీకు సందేహముగా నున్నదా ? నేను దప్పకుండ వైద్యునిఁ బిల్తును.

లక్ష్మ్మి—నాథా ! నే నొకవేళ దేహము చాలించునెడల నధికారుల వలన నీ కడికూడఁ గల్గునేమో ?

నా—లక్ష్మ్మి ! ప్రాణప్రియా! నీవు మరణించినతరువాత నాకురివచ్చునను యా విచారించుచుంటివి ? నాదోషమునకు హద్దు లేనట్లే నీప్రేమమునకుఁగూడ హద్దులేదే- దోషావతారమను నేను,

దొరలి కుంపటిలోఁ బడిపోయి కేకవేసి యేడ్చును.)

లక్ష్మి—(ఉలికిపడి లేచి) నాయనా! నాయనా! (లేచును.)

(అచ్చి నిద్రించుచుండును.)

లక్ష్మి—అమ్మో! నాతండ్రి కాలిపోయినాఁడే-(పిల్లవాని నొడిలోఁ బెట్టుకొని) అచ్చీ! లేవవేమి?

అచ్చి—(లేచి) అమ్మా! ఏమి?

లక్ష్మి—పిల్లవాఁడానైపు పండుకొనినప్పుడు కుంపటి దగ్గఱ దొరలకుండ ముగ లాఁగలేకపోయినావా?

కృష్ణు—(ఏడ్చుచున్నాఁడు.)

లక్ష్మి—అయ్యయ్యో! పిల్లవానిమెడక్రిందఁ గాలిపోయినదే- దీనికి మందేమి?

అచ్చి—అమ్మా! సిరా మంచిదమ్మా. తెచ్చెదను. (తెచ్చి రాచును.)

లక్ష్మి—నాయనా! నాయనా! నీ కెంత బాధగానున్నదో యి తండ్రీ! (ఏడ్చును.) నాతండ్రీ! నే నేమి చేయుదును తా—ఇంటిలోఁ బెద్దదిక్కైన మామామ్మ వెళ్ళిపోయినది. నేను దుస్సాధ్యమైన రోగముతోఁ బడియున్నాను. నీతండ్రిమాత్రము నాపుణ్యావశమున నింటికి వచ్చినారని సంతోషించుచుండగా నీ విట్లయితివేల? పరాత్పరుఁడా! నాబిడ్డకుఁ గొంచెము సౌఖ్యమైన సుఖమీయవా? (పిల్లవాని వక్షముపైఁ బెట్టుకొని, వీలగునంత వఱకు చేతుల జోడించుకొని నిలువఁబడి) అచ్చీ! శ్రీరామచంద్రమూర్తిని ప్రార్థించుకొందును. నేను దూలమునేమో—దగ్గఱ నుండుము. ఈశూల నన్నింతవేగముగా నింత సతసపెట్టిన దేమో. రామా రామా! రామచంద్రప్రభూ! చచ్చిపోయినబ్రాహ్మణబాలకునకుఁ బ్రాణమిచ్చి రక్షించితివి కావా

తండ్రీ! కాఁగినబాలకుని రక్షింపలేవా! తండ్రీ! నన్ను రక్షింపు మని నేను గోరను. నన్ను సీతాసాన్నిధ్యమున కొంత శీఘ్రముగాఁ దీసికొనిపోదువో యంత యెక్కువగా సంతోషింతును. అంతమహాదృష్టవతినిగా భావించుకొందును. నీదయవలననే నాభర్తకుఁ దిక్కుతిరిగినది. ఆతఁ డీకొడుకును బెట్టుకొని నాతోఁ డీసంసారమున సుఖించునట్లు కటాక్షింపుము. నన్నిదివఱ కాతఁడు తిరస్కరించినపాపమున కాతనికి యథార్థమగు పశ్చాత్తాపము కలిగినది. కావున నాతని నింక శిక్షింపక రక్షింపుము. పుత్త్రుఁడు చెడిపోవుచున్నాఁడే యని రోషమున మాయత్తగారు నాభర్త నన్ను కఠినమైనవాక్యముల కామెను క్షమింపుము. పునర్జన్మరహితమైన శాశ్వతపదవి నాపతివ్రతాశిరోమణి కీయఁ బ్రార్థింతును. నాభర్త యెదుటనే నన్ను దూషించిపలికిన యావేశ్యను క్షమింపుము. ఓతండ్రీ! క్షమింపుము. నే నెవరి కైనబాధ నిచ్చియుండిన యెడల నన్ను శిక్షింపుము కాని నన్ను బాధించినవారిని మాత్రము శిక్షింపకుము తండ్రీ! దీనదయాళూ! ఆర్తత్రాణపరాయణా! శ్రీరామచంద్రప్రభూ! నీవు భగవంతుఁడ వని యెఱిఁగియున్నను, నాభర్తను బూజించినతరువాతనే నిన్ను బూజించితిని గాని యన్యథా యాచరింపలే దని నీ వెఱుఁగుదువు. ఆతఁడు సన్మార్గవర్తి యగుటకే నే నాతనితోఁ గష్టపడితిని. నాకష్టము గట్టెక్కినది. నే నింక నిట నుండవలసిన పని లేదు. నేను నీపాదారవిందకీర్తన మొనర్చుకొనుచుఁ బైలోకమున నుండుదును. అదిగాక—

నా—(ప్రవేశించి) ఏమీ! పిల్లవాని నట్లు చేతిలోఁ బెట్టుకొని

[మొఱ్ఱ మన్నా వేమి ?

లక్ష్మి—పిల్లవాఁడు కుంపటిలోఁ బడినాఁడు. వీపుపైఁ గాలినది.

నా—అయ్యో! అయ్యో! (గుండెలపైఁ గొట్టుకొనుచు) నాతండ్రీ! నీవు నిప్పులలోఁ బడితివా? నాతండ్రీ! ఎట్లు పడెను? అచ్చీ! నీవు భద్రముగా నుండుమని చెప్పలేదఁటే.

లక్ష్మి—మనకర్మమున కది యేమి చేయఁగలదు?

నా—ఇప్పుడు నే నేమి చేయవలసినది? ఏమి యీకష్టములు! ఒక్క తల్లిపోయినప్పుడే మనసు కలఁతపడిపోవునే. ఒక్క భార్యకు జబ్బుగా నున్నప్పుడే మతి చెదరిపోవునే. ఈరెండుకష్టముల తో మతిపోయి యేడ్చుచుండఁగా కన్నయొక్కకొడుకు నిప్పు లలోఁ బడెనా? ఏమి యీయుపద్రవము! ఏమి యీమహో త్పాతము! అయ్యో! ప్రపంచమంతయు మునిఁగిపోయినట్లయి నదే! ప్రళయము వచ్చినట్లయినదే! ఆహాహా! వైద్యుఁ డెప్పుడుం గూడఁ బలికినాఁడు కాఁడు. తెల్లవాఱివచ్చెద నని యొక్కఁ డన్నాఁడు. లక్ష్మి! ఈపిల్లవాని నేమిచేయుదును. ధర్మవైద్య శాలకుఁ దీసికొనిపోయి యక్కడఁ జికిత్స చేయింతును. ఆశాల తలుపు తెప్పుడు తీసియుండును. అందులోని వైద్యులు మన యింటికి రారు కావున బిడ్డ నక్కడకుఁ దీసికొనిపోవలసియు న్నది. లక్ష్మి! నీ కెట్లున్నది? నీకుఁ జ్వర తిరిగిరాలేదుకదా?

లక్ష్మి—కాలేదు. పిల్లవానిని దీసికొనిపొండు. నాకు నీరసముగా నున్నది. కాని మీరు వచ్చినదాఁక భయములేదనుకొందును.

నా—అచ్చీ! ఈసారియైన భద్రముగా నుండెదవా? ఆమెను బట్టుకొని దగ్గఱఁ గూరుచుండుము. బిడ్డ నిచ్చెదవా?

లక్ష్మి—తీసికొనుము. (ఇచ్చును.) నాథా! మఱియొకసారి నాచేతం

లలోఁ బెట్టుఁడు. ముద్దుపెట్టుకొందును. (ముద్దుపెట్టుకొనును) (తనలో) ఇదియే కడపటిముద్దు గాదుగదా. (ప్రికా) తీసికొం దుతా?

నా—ఏమిసందేహింతువు.

లక్ష్మి—మీాతం వచ్చులోపల నాకుఁ బ్రమాదము సంభవించు నెడల మీారు, కొడుకుకూడ నాయొద్ద నుండకపోవుట తటస్థించు నేమొ ?

నా—అయ్యో! అయ్యో! అట్లైన నిన్ను విడిచిపెట్టి యెట్లు వెళ్లఁ గలను.

లక్ష్మి—వెళ్లకపోవునెడలఁ బిల్లవానిమాట యేమికావలయును ? నేను బెద్దదానను. నామాట యెట్లైనను జింతలేదు. నూ ఱేండ్లు బ్రదుకవలసిన బిడ్డమాట చూచుకోవలయును. ఎటు వచ్చినను, మీాతల్లి యవసానసమయమున మీారు తల్లియొద్ద లేనట్లే నాయవసానసమయమునఁ గొడుకు నాయొద్ద లేకపో వునేమో యని భయముగా నున్నది.

నా—అట్లైన నేను జెప్పుమాట విను. నిన్ను నే నెత్తుకొనెదను. అచ్చి బిడ్డ నెత్తుకొని నాతోడ వచ్చును. మనమందఱము గలసి వైద్యశాలకుఁ బోవుదము.

లక్ష్మి—ఇంటిలోఁ గాకుండ నడుమదారిలోఁ జావవలసివచ్చునేమో.-ఏ మియు వలదు. ఏమైన నగును. బిడ్డను దీసికొని వైద్యశా లకుఁ బొండు.

నా—పోవుదును. అచ్చీ! భద్రముగా నుండుము. లక్ష్మి! బిడ్డ నొకసారి చూచుకొనుము.

లక్ష్మి—ఇఁక నట్టెవెట్టిపడుట తగదు. చూచితిని.

(నారాయణరావు బిడ్డతోఁ బోవును.)

లక్ష్మి—అచ్చీ! కుంపటిలో నిప్పున్నదేమో చూడు.

అచ్చి—ఉన్నది.

లక్ష్మి—శూల వచ్చుచున్నది. కుంపటి దొడ్డిక్రిందఁ బెట్టుము.

అచ్చి—(పెట్టుచున్నది.)

లక్ష్మి—రామరామరామా (గిజగిజకొట్టుకొనుచున్నది.) అచ్చీ! అచ్చీ! అక్కడ నున్నావుకాదా? ఎక్కడకుఁ బోకుము.

అచ్చి—ఎక్కడకును బోనమ్మా.

లక్ష్మి—రామారామారామా చాపక్రిందఁ బఱువుము. త్వరగ. రామరామా—పఱచితివా—నేను దొరలి చాపపైఁ బడున ప్పుడు నన్ను ముట్టుకొనకుము. (దొరలి చాపపైఁబడి) రామ రామా!

అచ్చి—అమ్మా! అమ్మా! కడతేరిపోయితివా? ఎంతమంచిదానవు తల్లీ! దూరమున నుండియే నీపాదములకు మ్రొక్కుచున్నాను. అయ్యో! అయ్యో! (గట్టిగ నేడ్చును.)

(నరసయ్య ప్రవేశించును.)

నర—ఏమి? ఏమి?

అచ్చి—అమ్మగారికిఁ బ్రాణముపోయినది.

నర—(చేయిచూచి) ఇంకను బ్రాణమున్నది. తులసితీర్థ మిచ్చెదను. (లోనికిఁ బోయి తీసికొనివచ్చి యిచ్చును.) అచ్చీ! నే నిక్కడ నుండును. మీబాబుగారిని దానియింటికిఁ బోయి తీసికొనిరా.

అచ్చి—బిడ్డ కుంపటిలోఁ బడుటచేత నాతఁడు బిడ్డను దీసికొని వైద్యు

శాలకుఁ బోయినాఁడు.

సర—నీవు పోయి యాతనినిఁ దీసికొని రాఁగలవా?

అచ్చి—నాయనా! చీఁకటిలో వెళ్ళలేను.

సర—నీ విచ్చటనే యుండుము. నేను బోయి యాతనిఁ దీసికొని వత్తును.

అచ్చి—అక్కఱ లేదు. ఆతఁడే పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.

నా—(బిడ్డతోఁ బ్రవేశించి) లక్ష్మీ! లక్ష్మీ! పిల్లవాఁడు బ్రదుకఁ డని వైద్యుఁడు చెప్పినాఁడు. ఆ! ఆ! హా లక్ష్మీ! (పిల్లవానిని గుండె కద్దుకొని నేలఁ గూలును.)

అచ్చి—(నారాయణరావుబిడ్డను నిమ్మళముగఁ దీసికొని తొట్టెఁ బరుండఁ బెట్టును.)

సర—నారాయణరావూ! నీభార్య యింకను బ్రదికియున్నది. ఉన్నది. లే.

నా—ఏదీ! ఏదీ! ఉన్నదా! ఉన్నదా! లేచినదా! ఏదీ! నాకుఁ గన్నులు కనఁబడకుండనున్నవి. ఎక్కడ! ఎక్కడ!

సర—నారాయణరావూ! తొందరపడకు. అతివిచారమున మనుజునకుఁ దగదు. మనస్సు చెడిపోవుటచేతఁ గన్నులు కనఁబడకున్నవి. (కన్నులను నీళ్ళరాచి) ఇదిగో! చూడు. నీభార్య.

నారా—ఇంతవఱకు క్రిందఁ బడుకొన్న దేమి? లేవవా? నాబిడ్డఁ డేఁడీ! అచ్చీ! వానిని నాచేతి కిమ్ము. లక్ష్మీ! ఇదిగో నీబిడ్డ. చూచుకో- ముట్టుకో- ముద్దుఁబెట్టుకో- పాలిచ్చి ప్రక్కలోఁ బండఁబెట్టుకో- ఏది- ఏది- మాటలాడవేమి- లక్ష్మీ—

(అని గావుకేకలు వైచును.)

సర—బిడ్డఁడు బ్రదికియే యున్నాఁడు- తల్లియు బ్రదికియే యున్నది. ఎందుల కీదుఃఖము?

నాఠా—నాబిడ్డఁ డింక బ్రదికియున్నాఁడా ! లక్ష్మీ! నీ వేమని చెప్పితివో జ్ఞప్తి లేదా— బిడ్డకుడితొడవిూఁదఁ దలనుంచుకొని తల్లి చచ్చిపోవునెడల నామె కుత్తమగతి యని నాకు బోధించితివి కాదా ? ఇదిగో- నీబిడ్డతొడపైఁ దలఁ బెట్టుకొనుము. నేను బిడ్డను బట్టుకొందును—నాకట్టిజోగము నాపాపముచే సిద్ధింప లేదు. నాకుత్తరమునకి సిద్ధించుచున్నది. నాయనా ! తండ్రీ ! ' నేను మామ్మరొయొద్దకు వెళ్ళెద ' నని యంటివికాదా ? తెల్లము వా ! మీయమ్మనుగూడఁ దీసికొని పోవుదునా ? తండ్రి నైన నన్ను వదలివైచెదవా ? అంతఅమును బోదము- లక్ష్మీ ! నీయత్త నాతోనేమునెనో జ్ఞప్తియున్నదా? " ఇదిగో! ఈమహా తేజస్విని ! ఈపతివ్రతామణి ! నోటిమాట యైన నెఱుఁగని వట్టిగోల ! నంతతభగవచ్చింతాపరాయణ! ఆమెకాళ్లపైఁ బడి, నేను మహాద్రోహిని, నన్నుఁ గటాక్షింపు ' మని వేఁడు ' మన లేదా ? ఇంతకంటె నాకుఁ బ్రపంచమునఁ జేయవలసిన ముఖ్యకార్య మేది ? ఇదిగో బట్ట మెడఁ జుట్టుకొనుచున్నాను. ఇదిగో నీకు సాష్టాంగపడుచున్నాను.

" నధర్మనిష్ఠోస్మి నచాత్మవేదీ
నభక్తిమాన్ త్వచ్చరణారవిందే
అకించనోనన్యగతిశ్శరణ్య
త్వత్పాదమూలం శరణం ప్రపద్యే. "

నాదుష్టవృత్తిని ఖండించినదానవు—నాకు బుద్ధి నిచ్చినదానవు- నాకు భక్తి నొసఁగినదానవు—నీవు ! నీవే నాకు దైవమువు- నాచరిత్ర లోకమునఁ బ్రకటింపఁబడవలసి యున్నది. నరోస

అయ్యా! దొడ్డిలోనికిఁ బోయి రుబ్బురోటిక్రింద రూపాయల మూట యున్నది. తీసికొనిరా—

(నరసయ్య పోవును.)

నా—అయ్యో! ఎగుపులు వచ్చుచున్నవి. ప్రాణప్రియా! వెడలిపోయితివా! ఒక్కయడుగులో నేనును వత్తును.

(నరసయ్య మూటతోఁ బ్రవేశించును.)

నా—నరసయ్యా! మావంశ మంత మగుచున్నది. ఆరూపాయలలో నీకుఁ దోఁచినన్నిరూపాయలు మాయుత్తరక్రియలక్రింద వ్యయ మొనర్చుము. మిగిలినరూపాయలతో మాయింటియొద్ద నొక్కరాతిస్తంభము కట్టింపుము. దానిపై నాభార్య లక్ష్మివిగ్రహము చెక్కింపుము. దానిక్రింద "నారాయణుఁడను దుర్మార్గుఁడు వేశ్యాలంపటుఁడై, పతివ్రతాతిలకమైన భార్యను డొక్కలోఁ బొడిచి చంపినాఁడని తాటికాయలంత యక్షరములతో శిలాశాసనము చేయింతువా? చేయింపక తప్పదు. కవుల వ్రాఁతలకంటె రాతిమీఁదివ్రాఁతలు శాశ్వతము లని నానమ్మకము. నాయనా! కృష్ణా! మీయమ్మ వెడలిపోయినది. నిన్నెత్తుకొనుటకు నే నింక నున్నాను. హా! నీవుకూడ వెడలిపోయితివా! ఇఁక నాపాలిటి కృష్ణుఁడే లేఁడా? నే నింక ఉండుటకు— లక్ష్మీ! వచ్చుచున్నాను—రామరామా! (అఱచి నేలపైఁ బడి మరణించును.)

నర—రామరామరామా! ఈతఁడుకూడ మరణించినాఁడే! నోటివెంట రక్తము కారుచున్నది. గుండె పగిలిపోయినదికాఁబోలు. అహా! మహామారి యింటఁ బ్రవేశించినను నింత సంఘమరణ మింతశీఘ్రముగ నొనర్పలేదే! భాగ్యహీనతయే పదునాల్గు

మారులంత ప్రబలమైనది. రామ రామా! ఎంతకష్టాంతమైన చరిత్రమును జూచితిని.

ధరణి యీతిబాధలు లేక తనరుఁగాక
ప్రజలయన్యోన్య వైరముల్ పాయుఁగాక
నీతిపాలనమున రాజు నెగడుఁగాక
కవిత రాజపోషణమునఁ గ్రాలుఁగాక!

యను భరతవాక్యమున కవకాశము లేదుగదా!

ఇది పంచమాంకము

సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ.



శ్రీయుత పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి
ఇతర గ్రంథ రాజములు.

| శ్రీమద్రామాయణనాటకములు. | | | వెల |
|---|---|---|---|
| 1 కల్యాణరాఘవము | ... | ... | 0—8—0 |
| 2 పట్టభంగరాఘవము లేక పాదుకాపట్టాభిషేకము | | | 1—4—0 |
| 3 వనవాసరాఘవము | ... | ... | 0—12—0 |
| 4 విజయరాఘవము | ... | ... | 1—0—0 |
| 5 కంఠాభరణము (హాస్యరసనాటకము) | ... | | 1—0—0 |
| 6 హాస్యవల్లరి | ... | ... | 0—12—0 |
| 7 నర్మదాపురుకుత్సీయము (శృంగారనాటకము) | | | 0—12—0 |
| 8 సరస్వతి | ... | ... | 1—0—0 |
| 9 రాధాకృష్ణ (భక్తిరసనాటకము) | | ... | 0—12—0 |
| 10 విప్రనారాయణ | ... | ... | 0—12—0 |
| 11 సాక్ష్యుపన్యాసములు | ... | ... | 1—4—0 |
| 12 ముద్రిక | ... | ... | 0—12—0 |
| 13 వీరమతి | ... | ... | 1—4—0 |
| 14 * స్వర్గవివాహము | ... | ... | 0—12—0 |
| 15 * కోకిల | ... | ... | 0—12—0 |
| 16 * పూర్ణిమ | ... | ... | 1—0—0 |
| 17 బుద్ధబోధసుధ | ... | ... | 1—0—0 |
| 18 సారంగధర | ... | ... | 0—8—0 |
| 19 చూడామణి | ... | ... | 0—12—0 |
| 20 ప్రచండచాణక్యము | ... | ... | 1—4—0 |
| 21 * కథాలహరి (చిన్నకథలు) | | ... | 1—8—0 |
| 22 మాలతీమాల | ... | ... | 0—12—0 |
| 23 పద్మిని | ... | ... | 0—12—0 |
| 24 విచిత్రవివాహము | ... | ... | 0—10—0 |
| 25 సరోజిని | ... | ... | 0—12—0 |

* ఈగుర్తుగల పుస్తకములు అచ్చుపడనున్నవి.